బంజరుభూముల పంపిణీకి
ఆంధ్ర ప్రభుత్వ పధకంపై
రివెన్యూమంత్రి వివరణ
—4 వ పేజీ

# ఆంధ్రపత్రిక

విజయవాడ పాత పట్నానికి
మంచినీరు సప్లయి పధకం:
పురపాలక సంఘ తీర్మానం
—2 వ పేజీ

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 41. సంచిక 120 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 1-8-1954 Reg. No.M. 5745 10 పేజీలు వెల 2 అణాలు.

# అస్సాం, బెంగాల్, బీహార్‌లలో వరదలవల్ల వూళ్లకువూళ్లే నష్టం

## ఫార్మోజాలోని కొమింటాంగ్ బలాలకు అమెరికన్ జెట్ విమానాల సహాయం

### త్వరలోనే పంపుతున్నట్లు సూచన

### భారీరకం రష్యన్ జెట్ విమానాలు విహరిస్తున్నందుకు చాంగ్ కైషేక్ భీతావహం

వాషింగ్టన్, జూలై 30: ఫార్మోజాలో కొమింటాంగ్ బలాలకు అమెరికా చాలా సేబర్ జెట్ ఫైటర్ విమానాలను పంపిస్తున్నట్లూ, ఇవి త్వరలో అక్కడికి బయలు దేరుతున్నట్లూ నేడిక్కడ తెలియవచ్చింది.

చైనా తీరంలో మేలిరకం రష్యన్ జెట్ విమానాలను కమ్యూనిస్టులు చేరుస్తున్నందుకు చాంగ్ కైషేక్ చాలా భయపడుతున్నాడనీ, పాతరకం విమానాలు వాటి ధాటికి నిలవలేవు గనుక మంచిరకం వాటిని పంపించాలని అమెరికాను కోరాడనీ తెలుస్తున్నది. చైనా భూభాగంమీదను, పరిసర ద్వీపాల మీదను...

### దూది వాయిదా వ్యాపార నిషేధం

న్యూఢిల్లీ, జూలై 30 దేశీయ దూదివిషయంలో వాయిదా వ్యాపారాన్ని నిషేధిస్తూ భారతప్రభుత్వం ఉత్తర్వుచేసింది ఇందువల్ల గుర్తింపబడిన మండలుల సభ్యులుగానీ, వారిద్వారాగానీ జరిగేవాయిదావ్యాపారం తాలూకు కాంట్రాక్టులుతప్ప మిగతావి చట్టవిరుద్ధమైనవట్టవవుతాయి.

## నాగర్‌హవేలీ సమీప గ్రామంలో హోరీ ఆక్రమణ

### ఆజాద్ గోవా వలంటీర్ల జైత్రయాత్ర

వాసి, జులై 31 నాగర్ హవేలీ లంకలో ఉన్న లావాోరి గ్రామం నేడు తెల్లవారుతూ ఉండగా పోర్చుగీసు బంధాలు విడిపించుకుని బయటపడింది గోవా ప్రజా పార్టీ వలంటీర్లు 100 మంది జార్జివాన్ నాయకత్వాన, నేడు అర్ధరాత్రి దాటాక ఈ గ్రామంలో ధారాపాతంగా వర్షం కురుస్తుండగా ప్రవేశించారు.

...

చాలాభాగం సెల్వాసాలోనే ఉంచి, మిగతా కొస్తా 9 గ్రామాలకు పర్దారనీ, సెల్వాసాలో శక్తివంతమైన వార్తా ప్రసారకేంద్రం ఉన్నదనీ, ఇక్కడి వార్తలు దీనిద్వారా డయ్యూడామనలకు ఎప్పటికప్పుడు చేరవేస్తారనీ కూడా, వలంటీర్ దళానికి వార్తలు వచ్చాయి.

ఈ ప్రాంతంలో వానలు విపరీతంగా కురుస్తుండడంవల్ల, జలోనదులు ఉధృతంగా ప్రవహిస్తున్నందువల్ల వలంటీరు అధిక ప్రయాసలకు లోనై పురోగమిస్తున్నారు.

### ఆగస్టు 15 ఉద్యమానికి 150 మంది వలంటీరు

పూనా, జూలై 30: ప్రజాసోషలిస్టునాయకుడు ఎస్. జి. గోరే అధ్యక్షతన తయారవుతున్న గోవా విమోచనదళంలో హైదరాబాద్, మహారాష్ట్ర, రాజస్థాన్ మధ్యప్రదేశ్‌లకు...

## మావ్ మావ్ సమస్య భారతదేశ మధ్యవర్తిత్వం ద్వారా పరిష్కారం: కెన్యా కాంగ్రెస్ అధ్యక్షుని సూచన

నైరోబీ, జూలై 31: మావ్ మావ్ సమస్యను సత్వరంగా పరిష్కరించడానికి కెన్యా ప్రభుత్వం, బ్రిటిషుప్రభుత్వము భారతజాతి సహాయాన్ని అర్థించటం యోగ్యమైన విషయం అని కెన్యా ఇండియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఎన్. ఎస్. మాంగత్ నేడు ఒక సూచన చేశారు.

ఈ కాంగ్రెస్ మహాసభ 28 వ వార్షిక సమావేశంలో మాట్లాడుతూ, మావ్ మావ్ నాయకులంతా ఇండియా అంటే అమితమైనగౌరవప్రపత్తులు, భక్తితాత్పర్యాలు కల్గివున్నట్లు కెన్యా ప్రభుత్వమే అంగీకరిస్తుంది. అటి సందర్భంలో ఇండియాను పిలిచి, మావ్ మావ్ ఉద్యమాన్ని సర్దుబాటు చేసుకోవటం ఉచితంగా మాకు కన్పిస్తున్నది. అందువల్ల కెన్యా బ్రిటన్‌కు గూడా లాభం సమకూడుతుంది అని ఆయన అన్నారు.

కెన్యాలో భారతీయులు కొన్నటికేనని, వారికి బ్రిటిషు సింహాసనంపట్ల...

## ట్యునీషియాకు ఫ్రెంచి ప్రధాని ప్రయాణం

పారిస్, జూలై 31: ఫ్రెంచి ప్రధాని మెండిస్ ఫ్రాన్స్ అకస్మాత్తుగా నేటి ఉదయం విమానంలో ట్యునీషియా నగరానికి బయలు దేరారు. ట్యునీషియా రాజ్యాంగ సంస్కరణలకు తాను తయారు చేసిన పథకాన్ని సుల్తానుకు సమర్పించేందుకు ఆయన అక్కడికి వెళ్ళారు.

### బుడమేరు వరదలు

### రాకపోకలకు ఆటంకం

## ప్రవాహాలమధ్య లంకలలో చిక్కుబడిన వేలాది ప్రజలకు విమానాలద్వారా ఆహారం సప్లయిచేయవలసిన అగత్యం

### ఇంతటి ఉధృతం ఇదివరకెన్నడూ లేదని మంత్రి ప్రకటన: బ్రహ్మపుత్రానది బీభత్సస్థితి

కలకత్తా, జూలై 31: ఉత్తర బెంగాలులో జలమయమైపోయిన విశాల ప్రాంతంలో చెదురు చెదురుగా లంకలలోవున్న చాలాచోట్ల దాదాపు 45 వేల మంది ప్రజ ఎటూ కదలటానికి వీలులేకుండా వుండిపోయారని తెలియవచ్చింది. జూలై 25 నుంచీ పొంగి మహావేగంతో ప్రవహిస్తున్న నదులు అనేకచోట్ల గట్లుతెంచుకొని పంటలకూ, పశువులకూ అపారనష్టం కలిగించాయి. వందలాది గుడిసెలు కొట్టుకుపోయాయి. ఇట్లా చెదురుగా వుండిపోయిన చోట్లకు వెళ్ళటానికి భూమిమీదుగా మార్గంలేనందున విమానాల ద్వారానే ఆహారపదార్థాలు అందజేయవలసి వుంటుందంటున్నారు. ఒకచోటగల ఒక పెద్ద రైసుమిల్లులోని 25,000 మణుగుల బియ్యం నీళ్ళపాలైపోయింది. ఒక్కగింజ కూడా దక్కలేదట. తీస్తానదికి పడిన గండి వెడల్పు 800 అ. నుంచి 2600 అ. పెరిగింది.

### బీహారు

పాట్నా, జులై 30: పొంగి పొర్లుతూ ప్రవహిస్తున్న సిక్రానానది చాంపరాన్ జిల్లాలోని మరుబోలియా తానాలోని 80 గ్రామాలను ఊడిచి పెట్టేసింది. నిన్నటినుంచి వర్షాలు తగ్గిపోయాయికాని ముంపు తీయలేదు. సహార్సా జిల్లాలో 4 లక్షల పైచిలుకు ప్రజ ఇక్కట్లకు లోనైనారు. కోసీ నదికాలువలు ఎండిపోయినవన్నీ నిండిపోయి గట్లు తెంచుకొని గ్రామాలమీద పడ్డాయి. అధికారులు ఎంత సతమతపడుతున్నా, బోట్లు చాలినన్ని లేనందున ఉపశమన, సహాయ కార్యాలు చురుకుగా జరగటంలేదు. ఇవ్వాళ గండకీనదిలో ప్రవాహం అంతకంతకు హెచ్చుతూ ముజఫర్‌పూర్ పట్నాన్ని లోగొంటోంది. సమాచారశాఖ మంత్రి ఇంతవరకూ వచ్చిన సమాచారాన్ని బట్టి ఇటువంటి వరదలు ఎన్నడూ రాలేదనీ, నష్టం ఎంతో చెప్పటం ఇప్పుడు సాధ్యంగాదనీ తెలుస్తోందన్నారు.

### అస్సాం

గౌహతీ, జూలై 30: ఎగువ అస్సాములోని ఒకపట్నం వరద చుట్టుముట్టినందున విసిరేసినట్లు నిలిచిపోయింది. దారాంగ్ జిల్లాలో చాలా ప్రదేశాలు జలమయమైపోయాయి. అంతకంతకు పొంగుతున్న బ్రహ్మపుత్రానది తేజ్‌పూరువద్ద గల 4 గ్రామాలను ముంచివేసింది. గోల్పరాజిల్లాలోని దక్షిణ సాల్మరాలో సుమారు 360 చ. మైళ్ళమేర 6 అడుగుల నీరు నిలిచింది. నవగాంగ్ ప్రాంతంలో కూడా ప్రవాహ ప్రమాణం హెచ్చుతున్నదేగాని తగ్గటంలేదు. 49 గ్రామాలలో నీరు ఇళ్ళకప్పులవరకూ వుందట.

### నేపాల్

ఖట్మండూ, జూలై 30: ఇటీవలి వరదలవల్ల ఇక్కడికి 22 మైళ్ళలో గల భిమ్‌ఫేదీ చుట్టుపట్ల సుమారు 37 మంది ప్రాణాలు కోల్పోయినట్లు తెలిసింది. ప్రధాని కోయిరాలా ఇవ్వాళ సివిల్, మిలిటరీ ఉద్యోగుల సమష్టి సమావేశం జరిపి ఆ ప్రాంతంలో జరగవలసిన సహాయ కార్యాలను గురించి చర్చించారు. మెరాంగ్ జిల్లాలో 10 గ్రామాలు, సప్తారిజిల్లాలో 10 గ్రామాలూ మునిగిపోయినవట.

## గ్యాంట్సేకోట పతనం

### 34 మంది భారతసైనికుల మృతి

న్యూఢిల్లీ, జూలై 30: న్యాంచంగ్ నదిపై గల గ్యాంట్సేకోట ఇటీవల వరదల మూలంగా కూలిపోయినందువ అక్కడి భారతసైనికులు 48 మందిలో 14 మంది మాత్రమే బ్రతికి బయటపడ్డట్లు ధృవపడిన వార్తలు తెలుపుతున్నవి. ఈ బ్రతికి బయటపడిన వారిలో వైద్యులెవరూ లేరు. ఈ 14 మందితో కలిసి బయలు దేరిన సహాయబృందం మొన్న 26 న గ్యాంట్సేకి దక్షిణంగా 14 మైళ్ళ సుమారునవున్న కాంగ్ చేరారు. వీరు యాటుంగ్ వెళ్ళటం... కొంటున్నారు. గ్యాంట్సే, యాటుంగ్‌లలో విపరీతవర్షాల మూలంగా అక్కడ ముంపు ప్రమాదం అధికమవుతోంది. ఈ రెండుపట్నాలూ కొట్టుకు పోతాయా అని కూడా భయపడుతున్నారు. ఇటీవల నూరుఇండ్లు కూలిపోయి 200 పైచిలుకుమంది చనిపోయారట. కాలింపాంగ్‌లో టిబెట్ దేశీయుల వ్యాపారం స్తంభించిపోయింది.

## కొరియా ఏకీకరణ

### ఐసెన్‌హోవర్, సింగ్మన్‌రీల ప్రకటన

వాషింగ్టన్, జూలై 30: ఐక్య, ప్రజాస్వామిక, స్వతంత్రకొరియాను స్థాపించటానికి ముందడుగు వేయ నిశ్చయించామని ఐసెన్‌హోవర్, సింగ్మన్ రీ నేడొక సంయుక్త ప్రకటనలో వెల్లడించారు. ఈ విషయమై ఉభయదేశాల సైనిక సలహాదార్లు, ఆర్థికసలహాదార్లు వాషింగ్టన్‌లో సవివరంగా చర్చలు జరపగలరని వారు తెలియజేశారు.

## ఢిల్లీలో ఇండోచైనా యుద్ధ విరమణ సంఘ తొలి చర్చలకు రంగం సిద్ధం

### చర్చలలో కార్యక్రమ విశదీకరణకై ఆర్. కె. నెహ్రూచే 100 ప్రశ్నలు తయారు

### ఇటలీ ఫ్రాన్సులలోని భారత రాయబారులు పాల్గొనే సూచన

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, జులై 30: ఆగస్టు 1 వ తేదీ ఆదివారం నాడు ఇక్కడ జరగబోతున్న ఇండోచైనా యుద్ధవిరమణ సంఘ తొలి సమావేశంలో కార్యనిర్వహణ పద్ధతిని చర్చించటం జరుగుతుంది. ఈ సమావేశానికి భారత విదేశాంగ కార్యదర్శి ఆర్. కె. నెహ్రూ నూటికిపైగా ప్రశ్నలను సిద్ధం చేసుకునివచ్చినట్లు తెలుస్తున్నది.

మీనన్ నేడు విమానాశ్రయంలో దిగేటప్పటికి రాత్రి 11½ అయింది. విజయలక్ష్మీపండిట్, ఎస్. రాఘవన్ పిళ్ళె, తాత్కాలిక బ్రిటిషు హైకమిషనర్ మిడిల్టన్, ఇండోనేసియా రాయబారి పాలార్, భారతప్రధాని కార్యదర్శి ఎం. ఓ. మత్తయ్, ప్రముఖ ఉద్యోగులు స్వాగతమిచ్చారు.

ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్ జెనీవాసభ సాఫల్యానికి ప్రధాని నెహ్రూ పంపిన అభినందన సందేశానికి జవాబిస్తూ, జెనీవాలో మీనన్ చేసిన సహాయాన్ని ప్రత్యేకించి ప్రశంసించారు.

### సయాం ఫిర్యాదు ఉపసంహరణ

### ప్రధానితో కృష్ణమీనన్ సమాలోచన

...మధ్యవర్తిగా పనిచేసిన వి. కె. కృష్ణమీనన్ నేటిరాత్రి ఢిల్లీకి తిరిగి వచ్చారు. అప్పటికి చాలా పొద్దుపోయినప్పటికీ, సరాసరి ప్రధానినెహ్రూ వసతిగృహానికివెళ్లి ఆయనతో సమాలోచన జరిపారు.

సయాం-ఇండోచైనా సరిహద్దులకు సమితి ఒక కాపలాసంఘాన్ని పంపాలని ఆగస్టులో తాను సమితిని కోరబోతున్నానని సయాం లోగడ భద్రతా మండలిలో ప్రతిపాదించగా రష్యా వీటో చేసింది.

## వెనకబడిన దేశాల సహాయానికి ప్రత్యేక నిధి

## గూడూరు రేణిగుంట రైలుమార్గం త్వరలోనే బ్రాడ్‌గేజ్‌గా మార్పు

న్యూఢిల్లీ, జూలై, 30: గూడూరు, రేణిగుంటలమధ్య ప్రస్తుతంవున్న మీటర్ గేజ్ రైలుమార్గాన్ని బ్రాడ్‌గేజ్‌గా మార్చటం నిమిత్తం అయ్యేపని త్వరలోనే ప్రారంభం కాగలదని తెలుస్తున్నది.

ఈ పనినిమిత్తం కేంద్రప్రభుత్వంవారు 1,34,00,000 రూపాయలు మంజూరు చేసివున్నారు. ఈపనిని అతిశీఘ్రంగా ముగించాలని రైల్వేబోర్డువారికి ఉత్తర్వుచేసింది.

ఈ గూడూరు, రేణిగుంటల మధ్యవున్న రైలుమార్గం 52 మైళ్ళపొడవు వుంది. బెజవాడ, మద్రాసులమధ్య రవాణా సౌకర్యాలు పెంచడానికి దీన్ని ఇప్పుడు ఇట్లా బాగుచేస్తున్నారు.

## జాతీయవిస్తరణ ప్రణాళిక

### చింతలపూడి బ్లాకుకమిటీ నిర్ణయాలు

చింతలపూడి, జూలై 28: ఏలూరు రివెన్యూ డివిజనల్ ఆఫీసరు, కమిటీ చైర్మన్ శ్రీ కె. జె. నరసింహంగారి అధ్యక్షతన చింతలపూడి జాతీయ విస్తరణ ప్రణాళిక కమిటీ తొలి సమావేశం మొన్న 28 వ తేదీ తాలూకా ఆఫీసులో జరిగింది. ఏలూరు కో-ఆపరేటివ్ సబ్ రిజిష్ట్రారు, డెవలప్‌మెంటు సాంకేతిక నిపుణులు, కమిటీ సభ్యులు హాజరైనారు. డెవలప్‌మెంటు ఆఫీసరు, కమిటీ కార్యదర్శి శ్రీ గుళ్లపల్లి సత్యనారాయణమూర్తిగారు కమిటీ ఆశయములను వివరించిరి.

పశ్చిమగోదావరిజిల్లా ప్లానింగుకమిటీలో చింతలపూడి తాలూకాకు ప్రాతినిధ్యం యివ్వవలసినదిగా శ్రీ గద్దె విష్ణుమూర్తిగారు ప్రతిపాదించిన తీర్మానం కమిటీ ఆమోదించింది.

ఈ ప్రణాళికలో ప్రభుత్వోద్యోగులు చేయవలసిన పనులు ఒకభాగంగాను ప్రజాసహకారంతో చేయవలసిన పనులు రెండవభాగంగాను విభజించారు. రెండవభాగంలో ఇరిగేషన్ లోన్సుకు రు 80 వేలు, స్థానిక కార్యక్రమాలకు రు 40 వేలు, సాంఘిక విద్యనిమిత్తం రు 10 వేలు ఇతర సహాయ గ్రాంటు రు 10 వేలు మొత్తం రు 90 వేలు కేటాయించారు. రివిన్యూడిపార్టుమెంటువారు ఇచ్చే ఋణాలుగాక డెవలప్‌మెంటు తక్కావిఋణాలక్రింద లక్ష రూ/-లు కేటాయించారు. రు 500 లు అప్పువరాసరి మంజూరుకు డెవలప్‌మెంటు ఆఫీసరుకు అధికారం ఉన్నది.

పంచాయతీబోర్డులు, ప్రజల సహకారంతో 34 గ్రామాలను కలిపే 118 ఫర్లాంగులు మట్టిరోడ్లు వేయ అంగీకరించారు. ప్రభుత్వంవారు ఇచ్చే రు 90 వేలు గాక ప్రజలు ధనరూపేణ, శారీరకశ్రమద్వారా రు 90 వేలు కాంట్రిబ్యూషన్ యిచ్చే పద్ధతిపై వివిధ గ్రామాల్లో యీ క్రింది స్కీములు ఆమోదించారు.

డ్రైనేజీ, కల్వర్టులు రోడ్డుడాములు మొదలు కమ్యూనిటీ బిల్డింగులు, క్లబ్బులు, గ్రంధాలయాలు, రేడియో జనసేవిక్, ఆదిమజాతివిద్య, స్కౌటు, రైతుసంఘాలు పాలసప్లయి కేంద్రాలు, కోళ్లపెంపకం, గోడౌన్లు, ఆరోగ్య కేంద్రాలు, కుటీరపరిశ్రమలు, సహకారగృహనిర్మాణం, జపాన్ వరిసాగు, కాంటూర్ బండింగు వగైరా స్కీములుగలవు. కంట్రిబ్యూషన్ ఇచ్చే ఏ స్కీమునైనా ఎప్పుడుపడితే అప్పుడు ఇందు చేర్చుటకు అవకాశంగలదు. (స్వ. వి.)

## కమ్యూనిటీప్రాజెక్టు పనుల తనిఖీ

### ప్రభుత్వోద్యోగుల పర్యటన

కాకినాడ, జూలై 29: ఆంధ్ర అభివృద్ధిశాఖ కమిషనరు శ్రీ నటరాజన్, ఆరోగ్యశాఖ డైరెక్టరు యస్. దక్షిణామూర్తి, వైద్యసర్వీసుల డైరెక్టరు యస్. కృష్ణారావుగార్లు తదితర వున్నత ప్రభుత్వవుద్యోగులు, జిల్లాఆఫీసర్లు, నిన్న సమాజవికాసకేంద్రాలలో జరుగు పనులు తనిఖీ చేశారు.

సామర్లకోట సర్వసీమ్యూలు, శేషపట్టు కేంద్రం, వినోదకేంద్రం, ప్రసూతి కేంద్రం మున్నగునవి చూశారు. పిదప పెదపూడి, సావరంలలోని ఫిల్టరు పాయింట్లు చూచారు. రాయవరంలో తుల్యభాగలిఫ్ట్ ఇర్రిగేషన్ స్కీము, మంచినీటి సరఫరాయూనిట్ చూశారు. అచటనుంచి రామచంద్రపురం మీదుగ కరపవచ్చి ప్రాథమిక ఆరోగ్యకేంద్రం తనిఖీచేసి రాత్రి 8 గంటలకు కాకినాడ చేరుకున్నారు.

### ప్లానింగు అభివృద్ధి కమిటీల సమావేశం

ఈదినం కలెక్టరు కార్యాలయంలో జిల్లాప్లానింగు, అభివృద్ధికమిటీల సమావేశం జిల్లాకలెక్టరు శ్రీ హెచ్. సాంబమూర్తిగారి అధ్యక్షతన జరిగింది.

శ్రీ నటరాజన్ మాట్లాడుతూ పంచవర్ష ప్రణాళికల వుద్దేశ్యాలు వివరించారు. స్ఫోమతు ననుసరించి ప్లానింగు జరగాలని సూచించారు. పనిచేయు ప్రతివక్కరు ఒక వారం సంపాదన విరాళంగాయిస్తే రాష్ట్రానికి రు 25 కోట్లు చేకూరగలవన్నారు.

శ్రీ పెండ్యాల వెంకటనారాయణ మూగంటిబాపినీడు, బిక్కిన వెంకటరత్నం, సి. వి. కె. రావుగార్లు కమ్యూనిటీ ప్రాజెక్టులు, ప్రజల అవసరాలు గూర్చి ప్రసంగించారు. (స్వ. వి.)

## గత ఏడాది ప్రత్తిపంట

కర్నూలు, జూలై 30: 1953-54 లో ప్రత్తి పంటకు సంబంధించిన ఆఖరు నివేదికను రెవిన్యూబోర్డు ప్రకటించింది. ఈ నివేదిక ప్రకారం 1363 ఫసలీలో 6,59,300 ఎకరాలలో ప్రత్తి పండిందని అంచనా. అయిదేళ్ళమీద సగటున చూస్తే పెరుగుదలే కనిపించింది. అయితే రాష్ట్రం మొత్తంమీద ఎకరానికి ఉత్పత్తి మామూలు కన్నా తక్కువేనని అంచనాలు తెలుపుతున్నాయి. మొత్తం ఉత్పత్తి 392 పౌనుల బరువుగల 96,600 బేళ్లు. గత అయిదేళ్ళతో పోల్చిచూస్తే సగటున పెరుగుదలే ఉంది.

మనిషికి 82 2/7 పౌనుల బరువుగల మణుగు ప్రత్తి లింటు దామాషా టోకుధర 1954 మే 1 వ తేదీన ఈ క్రింది విధంగా ఉన్నట్టు తెలిసింది. కాకినాడ రు 83 లు, తెల్ల నార్దెరన్సు రు 76-18-0, ఎర్ర నార్దెరన్సు 75-13-0, ముంగారి రు 65-5-0, వెస్టరన్సు 77-8-0 లు ఉన్నది.

### పొగాకు పంట

1953 డిసెంబరు ఆఖరు వరకూ రాష్ట్రంలో పొగాకు నాట్లు జరిగిన ప్రాంతం 2,37,200 ఎకరాలనీ, గత ఏడాదికన్నా దాదాపు పదివేల ఎకరాలు తగ్గుతల ఉన్నదనీ ఇవాళ గెజెటులో ప్రకటించబడిన ప్రభుత్వ అంచనాలు తెలియజేస్తున్నాయి. నాట్ల కాలంలో ఈ ఏడాది విపరీత వర్షాలే విస్తీర్ణంలో తగ్గుదలకు కారణమని పేర్కొనబడింది.

ఈ నివేదిక ప్రకారం అధిక వర్షాలవల్ల కర్నూలు, అనంతపురంలలో వినా, మిగతాచోట్ల పొగాకు పంట తృప్తికరంగానే ఉన్నది.

### జొన్న పంట

1953-54 రాష్ట్రం మొత్తంమీద 28,24,000 ఎకరాలలో జొన్నపంట పండించబడిందనీ, గత సంవత్సరంతో పోలిస్తే బాగా తగ్గుదల ఉన్నట్లు అంచనాలు వ్యక్తపరుస్తున్నాయి. వర్షాలను బట్టి, ఈ ఏడాది బాగా ఆదాయంవచ్చే తదితర పంటలకు కొంత విస్తీర్ణం వినియోగించటం మూలంగా ఈ తగ్గుదల వచ్చినట్లు పేర్కొనబడింది.

గత సంవత్సరంతో పోలిస్తే, ఉత్పత్తిలో తగ్గుదల ఉన్నా, అయిదేళ్ల సగటు ఉత్పత్తి కన్నా హెచ్చుగానే జొన్నలు పండాయని ప్రభుత్వ నివేదిక వ్యక్తపరిచింది.

## విజయవాడ ఆస్పత్రి కమిటీ

### సర్వసభ్య సమావేశ విశేషాలు

విజయవాడ, జూలై 29: విజయవాడ ఆస్పత్రి కమిటీ గౌరవాధ్యక్షులు శ్రీ డి. గోవిందరాజులునాయుడుగారి అధ్యక్షతన సమావేశమై తమ కమిటీవారు యిస్తామన్న 70000 రు. విరాళంలో వెంటనే ఆస్పత్రి భవన నిర్మాణానికి ప్రభుత్వం అంగీకరించినందుకు కృతజ్ఞత తెల్పుతూ తీర్మానించారు.

కమిటీవారు ఇవ్వవలసిన మొత్తం విరాళం 3 లక్షల రూపాయలలో మిగతాభాగం (రు 28,000) వసూలవుతున్నప్పుడు ప్రభుత్వానికి యివ్వాలని ప్రభుత్వం పేర్కొన్నది.

సర్వసభ్య సమావేశానికి ఈ క్రింది వారిని సభ్యులుగా కో ఆప్టు చేసుకొన్నారు.

కృష్ణాజిల్లా కలెక్టరు, జిల్లా మెడికలు ఆఫీసరు, విజయవాడ సబ్ కలెక్టరు, విజయవాడపురపాలకసంఘం అధ్యక్షులు, ఆరోగ్యశాఖాధికారి, కమీషనరు, విజయవాడ తహశీల్దారు, ఆంధ్ర పవరుసిస్టం సూపరింటెండింగు యింజనీరు, విజయవాడ పబ్లిక్ వర్క్సు శాఖ సూపరింటెండింగ్ ఇంజనీరు, ప్రభుత్వ ఆస్పత్రిలోని డాక్టరు, డాక్టరు పి. వెంకటేశ్వరరావు, డాక్టరు చాగంటి సూర్యనారాయణమూర్తి, యం. ఆర్. అప్పారావు, మల్లాది ఫణిభూషణరావు, జె. సూర్యనారాయణరాజు, అట్లూరి రత్నయ్య, యం. వి. నరసయ్యనాయుడు, మాకేటి రామమోహనరావు, పచ్చిపులుసు వెంకటసుబ్బారావు, వేములకూర్మయ్య, కుంచే రుసత్యనారాయణ, అరికెపూడి రామనాథంచౌదరి, వై. రామలింగం, బచ్చు వెంకటేశ్వర్లు, మనికొండ వెంకట నరసింహం, ఆలపాటిరామమూర్తి, బుద్దా జగన్నాధం, పద్మనాభయ్య, మదన్‌లాల్ జకోటియా, దేసు వీరభద్రయ్య, చిట్టూరి పెద పుల్లయ్య, జె. ఖుశాలదాస్, శ్రీమతి సీతంరాజు సీతారామమ్మగారలు.

# విజయవాడ పాతటౌన్‌లో నీటి సప్లయి ప్రణాళిక

## మున్సిపల్ కౌన్సిల్‌చే 23 వేలు మంజూరు

విజయవాడ, జులై 30. విజయవాడ పాతటౌను 2, 3 వార్డులకు నీటి సరఫరా నిమిత్తం ఒక కొత్త పథకానికిగాను 23,000 రూపాయలను మంజూరుచేస్తూ విజయవాడ పురపాలకసంఘంవారు మొన్న సాయంత్రం శ్రీ అట్లూరి రత్నయ్యగారి అధ్యక్షతన సమావేశమై తీర్మానించారు.

ఈ రెండు వార్డులలో ప్రప్రథమంలో 6000 మంది జనాభాకు సరిపడే విధంగా 90,000 గ్యాలన్ల నీళ్లు సప్లయికి ఏర్పాటు జరిగింది. కాని, ప్రస్తుతం జనాభా దాదాపు 20,000 పెరగడంతో దాదాపు 3 లక్షల గ్యాలన్ల నీళ్లు అవసరం అవుతున్నది. కొత్త పథకం క్రింద, ప్రస్తుతం వున్న హైలెవెలు రిజర్వాయరు దగ్గరగా ఒక 'బూస్టరు పంపును' ఏర్పాటుచేసి అక్కడినుంచి నీళ్లను పంపుచేస్తే, కావలసిన ఒత్తిడితో కావలసిన నీరు ఈ ప్రాంతాలకు అందుతుంది. ఈ ప్రాంతాలు మిగతాపట్టణం కంటె చాల ఎత్తులో ఉన్నవి.

## జోసఫ్ బస్సుస్టాండు వద్ద గడియారం

విజయవాడ పురపాలకసంఘంవారు కొత్తగా నిర్మించిన జోసఫ్ బస్ స్టాండులో ఒక విద్యుచ్ఛక్తితో నడిచే గడియారాన్ని అమర్చాలని ఇదివరలో కవున్సిలువారు నిర్ణయించారు. విద్యుత్ గడియారాలు సరిగా పనిచేయవని పురపాలకసంఘ విద్యుచ్ఛక్తి ఇంజనీరుగారు సలహా ఇచ్చారు.

సందర్భానుసారంగా ఆగిపోయే విజయవాడ విద్యుచ్ఛక్తి సరఫరాపై ఆధారపడి విద్యుచ్ఛక్తితో నడిచే గడియారం ఏర్పాటుచేయడం, అది తరచు తడవకు ఆగిపోవడం, ప్రయాణీకులు తప్పుడు టైముతో బాధలుపడడం వాంఛనీయంగాదని శ్రీ గుడివాడ వేరరాజుగారు చెప్పారు.

విద్యుచ్ఛక్తితో నడిచే గడియారం, విద్యుచ్ఛక్తి ఆగిపోయిన తర్వాత 24 గంటలు విద్యుచ్ఛక్తి రాకుండానే పనిచేసే గడియారాలు తయారైనవని, అటువంటి వాటిని కొని అమర్చాలని తీర్మానం ఆమోదించబడింది. స్వ. వి.

## హైదరాబాదు ఏకాంకికల పోటీ

### నవ్య సాహితీసమితి ఏర్పాటు

హైదరాబాదు, జూలై 27: నవ్య సాహితీసమితి తెనుగు ఏకాంకనాటిక రచనలపోటీ జరుప నిశ్చయించింది. పోటీకి పంపు నాటికలు 45 నిమిషాల కాలంలో ప్రదర్శింపగలిగేటట్లు ఉండవలెను. నాటికలు క్రొత్తవి, ఇంతవరకు ప్రచురించనివిగా ఉండవలెను. ఉత్తమనాటికలను వరుసగా రూ. 50, 30, 20, బహుమతులు యివ్వబడును. యీ సమితి కార్యవర్గ సభ్యులు మాత్రం ఈ పోటీలో పాల్గొనరు. ఈ నాటికలు సమితికి చేరు ఆఖరుదినము అక్టోబరు 30: ఈ పోటీకి సంబంధించిన ఇతర వివరములన్నీ 'కార్యదర్శి' నవ్య సాహితీ సమితి, A-18-459/1, చిక్కడపల్లి, హైదరాబాదుకు రెండణాల స్టాంపులు జతపర్చి వ్రాసుకొన్న తెలియగలవని సమితి ఉపాధ్యక్షులు పోతుకూచి సాంబశివరావుగారు వ్రాస్తున్నారు.

## హైద్రాబాదు డ్రాయింగ్ పరీక్షలు

హైదరాబాదు, జూలై 29. ఈ సంవత్సరం జరిగే మొదటి గ్రేడ్-లోయర్-, రెండవ గ్రేడు-హైయర్-డ్రాయింగ్ పరీక్షలు డిసెంబరు ఆఖరు వారంలో రాష్ట్రమంతటాగల అనేక కేంద్రాలలో జరుగనున్నాయి.

ఈ పరీక్షలకు దరఖాస్తులు దాఖలు చేయుటకు ఆఖరు తేది 20 సెప్టెంబరు. హైదరాబాదు కేంద్రం కొరకు హైదర్ గూడాలోగల సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరుకు, జిల్లాకేంద్రాల కొరకు తత్సంబంధమైన కేంద్రాల సూపరింటెండెంట్లకు దరఖాస్తులు పంపుకోవలసి ఉంటుంది.

పూర్వపు పరీక్షలలో ఫ్రైవేటు కాని అభ్యర్థులు, ఒకటి లేక ఎక్కువ గ్రూపులు రిజర్వు చేయబడినవారు శేషయిన గ్రూపులలో మాత్రమే మళ్ళీ పరీక్షకు కూర్చోవచ్చు. వారికి ప్రత్యేకంగా వేరే దరఖాస్తుఫారాలు నిర్ణయింపబడియున్నవి. 1950, 1951 పరీక్షలలో ఒకటి, లేక ఎక్కువ గ్రూపులు రిజర్వుచేయబడి, ఆ తర్వాత రెండు సంవత్సరాల వరకు కూడా మిగతా గ్రూపులు పూర్తిచేయజాలనివారు మళ్లీ అన్ని గ్రూపులకు కూర్చోవలసి ఉంటుంది. అంటే వారు తిరిగి మొత్తం పరీక్షకు కూర్చోవలసి ఉంటుందన్నమాట.

ప్రభుత్వ పాఠశాలలు లేక ప్రభుత్వంచేత గుర్తించబడిన పాఠశాలల విద్యార్థులు తమ దరఖాస్తులను ఆయా స్కూలు హెడ్ మాస్టర్ల ద్వారా పంపించవలెను. సర్వీసులో ఉన్నవారైనట్లయితే తమ యజమానుల ద్వారా పంపించవలెను.

కల్దారు అణా కు ఒకటి చొప్పున నిర్ణీత దరఖాస్తు ఫారాలు హైద్రాబాదులోని హైదర్ గూడాలో గల సాంకేతికవిద్యాశాఖడైరెక్టరు కార్యాలయంలో లభించగలవు. పోస్టు ద్వారా ఫారములు పంపించగోరినట్లయితే తమ చిరునామాగల పోస్టు కవరు ఒకటి కూడా జతపరచి పంపవలసివుంటుంది.

## మంగళగిరిస్టేషన్ ప్లాటుఫారం నిర్మాణం పూర్తి

మంగళగిరి, జూలై 28: మంగళగిరి రైల్వేస్టేషన్ ప్లాట్ ఫారం పొడవు పెంచి ప్లాట్ ఫారం అంతట బెజవాడ స్టేషన్ ప్లాట్ ఫారం మాదిరి కప్పు వేయడం పూర్తి అయినది. విద్యుద్దీపములతో కూడ అలంకరింపబడింది. కాని యీ స్టేషన్‌వద్ద నీటిసప్లయి లేకపోవుట వలన యిబ్బటకు వచ్చే యాత్రికులకున్నూ, ప్యాసింజర్లకున్నూ చాలా యిబ్బందిగ వుంటున్నది.

## జిల్లా బోర్డులస్థానే పనిచేసే సంస్థలు

### ప్రభుత్వ పరిశీలన: శ్రీ సంజీవరెడ్డి ప్రకటన

కర్నూలు, జూలై 30: జిల్లాబోర్డుల స్థానే పనిచేసే సంస్థల యేర్పాటు విషయమై ప్రభుత్వం పరిశీలిస్తున్నదని శ్రీ సంజీవరెడ్డిగారు నేడు పత్రికా విలేఖరులతో చెప్పారు. జిల్లాబోర్డుల స్పెషలాఫీసర్ల పదవీకాలం పొడిగించే చట్టం అక్టోబరుతో పూర్తి అవుతుంది.

## శ్రీ అమృతరావు దీక్ష

### అవసరంలేదని మంత్రి శ్రీ కోటిరెడ్డిగారి ప్రకటన

కర్నూలు, జూలై 30: కృష్ణాజిల్లా భావదేవరపల్లి మాజీసైనికుల సమస్యగురించి ప్రభుత్వం గమనిస్తున్నదనీ అవసరమయిన చర్య తీసుకోగలదనీ, ప్రభుత్వదృష్టికి ఈ సమస్య తీసుకురావడమే శ్రీ అమృతరావుగారి ఆశయం కాబట్టి, యిక వారా దీక్ష కొనసాగించాల్సిన అవసరమేమీలేదని తామభిప్రాయపడుతున్నామనీ మంత్రి శ్రీ కోటిరెడ్డిగారు చెప్పారు. స్వ. వి.

## కాళేశ్వరరావుగారి ప్రకటనపై లచ్చన్నగారి విమర్శ

విజయవాడ, జూలై 28: ప్రస్తుత ఆంధ్ర ప్రభుత్వాన్ని కూలద్రోయుటకే గీత పనివారల వుద్యమం వుద్దేశింపబడిందన్న కాళేశ్వరరావుగారి ప్రకటన పూర్తిగ తప్పనీ, అధారరహితమనీ శ్రీ లచ్చన్నగారు ఒక ప్రకటనలో విమర్శిస్తున్నారు. ఈ వుద్దేశ్యం తమదికాదనీ, వేరే జీవనోపాధి కల్గించవలసినదిగ చట్టబద్ధమైన రీతిగ చేసిన విజ్ఞప్తులన్నీ విఫలమయినందుననే యీ వుద్యమం జరుపవలసి వచ్చిందనీ, తమ ప్రకటనలో పేర్కొన్నారు. ఆంధ్ర అసెంబ్లీ నిర్ణయాన్ని అమలుజరుపవలసినదిగ మంత్రివర్గానికి నచ్చచెప్పవలసినదిగా కాళేశ్వరరావుగారిని తాము కోరుతున్నామని కూడ ఇందులో శ్రీ లచ్చన్న వివరించారు. ప్రభుత్వం అసెంబ్లీ నిర్ణయాన్ని లక్ష్యపెట్టనందునే వుద్యమం ప్రారంభించవలసివచ్చిందనికూడ లచ్చన్నగారు తెలియజేశారు నీగా స్కీం వలన అవినీతి పెరగగలదని అభిప్రాయపడుతున్నామన్నారు.

## గుంటూరు కౌన్సిల్ సమావేశం

గుంటూరు, జూలై 27: పట్టణ పురపాలక సంఘంవారు నిన్న శ్రీ తూనుగుంట్ల వెంకటావుగారి అధ్యక్షతన ప్రత్యేక అవసరసమావేశం జరిపి 37 మంది గ్యాంగు కూలీలను రోజు కూలీ పద్ధతిపై పనిలో పెట్టాలన్న చైర్మను గారి లేఖను చర్చించారు. ఈ సమస్యపై ప్రస్తుతం ఇంజనీరు, కమీషనరు, భిన్నదృక్పథాలతో వ్యవహరించుట వలన పరిష్కారమార్గంగా ఈ సూచన ఆమోదించాలని చైర్మన్ గారు తమ లేఖలో కోరారు.

శ్రీ తిరుపతయ్య గారు ఈ తీర్మానం ఆమోదిస్తే విశ్వాసరాహిత్యం కాగలదనీ, కనుక ఈసమావేశానికి చైర్మన్ గారు అధ్యక్షులుగా ఉండరాదని అధిక్షేపణచెప్పి రూలింగు ఇవ్వమని కోరారు.

జొన్నలగడ్డ రామలింగయ్య, జి. వి. పున్నయ్యశాస్త్రి, నడింపల్లి వెంకటలక్ష్మీనృసింహంపు, జంగాలపల్లి లక్ష్మయ్యగార్లు కూడ యీ లేఖను అంగీకరిస్తే కౌన్సిలర్లు అసమర్థులని అంగీకరించినట్లు కాగలదనీ కనుక కౌన్సిలువారు గత నెల 24 న చేసిన తీర్మానం సక్రమమయినదనీ దానిని అమలుపరచుటకు మార్గమన్వేషించాలనీకోరారు. దానిపై చైర్ మన్ గారు తమ నోటును ఉపసంహరించుకున్నారు.

## అణుశక్తి ఉత్పత్తి సమస్యలు

### కామన్వెల్తు సమావేశం: చర్చిల్ నిరాకరణ

లండన్, జూలై 29: యూరేనియం ఉత్పత్తి, అణుశక్తి ఉత్పత్తి సమస్యలు, పరిశ్రమల్లో అణుశక్తి వినియోగం మొదలైన సమస్యలపై కామన్వెల్తు దేశాల విధానాన్ని సమన్వయించే నిమిత్తం కామన్వెల్తు సమావేశాన్ని ఏర్పాటు చేయాలని నేడు బ్రిటిష్ పార్లమెంటులో సూచించబడ్డది.

కన్సర్వేటివ్ సభ్యుడు మైకేల్ స్టూవర్టు చేసిన ఈ సూచనను చర్చిల్ నిరాకరిస్తూ, వెనకటి ఏర్పాట్లు సంతృప్తికరంగానే ఉన్నవని చెప్పారు.

## దొంగ రవాణా నిరోధనకు కాపలా

పుదుచ్చేరి, జూలై 30: దొంగతనంగా పుదుచ్చేరిలోకి అత్యవసర పదార్థాలు రవాణాకాకుండా నిరోధించే నిమిత్తం ఫ్రెంచిఇండియా విమోచనోద్యమ వాలంటీర్లు 12 మంది పరిసరాల్లో కాపలా కాస్తున్నారని ఫ్రెంచి ఇండియా మాజీమంత్రి ఇ. జి. పిళ్లె పేర్కొంటూ ప్రకటించారు.

ఆయన ఈ వలంటీర్ దళానికి అధిపతిగా ఉన్నారు.

## ఆంధ్ర ఇన్సూరెన్సు

### 1953 నివేదిక వివరాలు

పై కంపెనీ డైరెక్టరులు 1953 సంవత్సరాంతానికి కంపెనీలో జరిగిన వ్యాపారాభివృద్ధి గురించి యీ క్రింది నివేదికను జూలై 24 వ తేదీని జరిగిన 28 వ వార్షిక వాటాదార్ల సభలో అందజేశారు. వారి నివేదికలో యిట్లా కలదు.

ఈ సాలులో 10160 భీమా దరఖాస్తులు రూ. 2,20,99,850 భీమా చేయటానికి కంపెనీకి అందినవి. వీటిలోను గత సంవత్సరం నిలవఉండిన దరఖాస్తులందును కలిపి రూ. 1,71,90,600 మొత్తానికి భీమా పట్టాలు జారీచేయబడ్డాయి. ప్రీమియము మొత్తాల నికరాదాయం రూ. 41,88,471, వడ్డీలు అద్దెలు డివిడెండ్లవల్ల ఆదాయం రూ. 7,60,046. ఆదాయపన్ను పోను మొత్తం నికరాదాయం రూ. 6,17,279. 31-12-1953 తేదీనాటికి జీవిత భీమానిధి మొత్తము రూ. 2,08,85,324.

కంపెనీ వ్యాపారం చాలా సంతృప్తికరముగానున్నట్లు అక్చ్యుయరీలు అభిప్రాయం వెలిబుచ్చియున్నారు. 1951, 1952, 1953 సంవత్సరాలకు సాలుకు 6% డివిడెండును వాటాదార్లకు డైరెక్టరులు సిఫార్సు చేసియున్నారు. వెయ్యి రూపాయల పాలసీకి రూ. 12 బోనసు ప్రకటించబడియున్నది.

## బ్యాంక్ ఆఫ్ బరోడా

మద్రాసు, జూలై 30: జూన్ 30 వ తేదీతో అంతమైన అర్ధసంవత్సరానికి బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్ వారికి లిత్పూర్వం వచ్చిన లాభం రూ. 2,33,388-10-0 తో కలిపి రూ. 14,07,348-8-4 మొత్తం లాభం చేకూరినది.

సాలుకు 10% చొప్పున ఆదాయపన్ను సహా ఉచితంగాయిచ్చి వాటాదార్లకు తాత్కాలిక డివిడెండ్లు పంచటానికి డైరెక్టరులు తీర్మానించి రూ. 5,00,000 అందునిమిత్తం ప్రత్యేకించి మిగతా నిలవ మొత్తమైన రూ. 907,348-8-4 కొత్త లెక్కలకు మార్చారు.

## గోకవరం వద్ద రోడ్డుపై ప్రవాహం

మదరాసు, జూలై 29: తూర్పుగోదావరిజిల్లాలో రాజమహేంద్రవరం గోకవరంరోడ్డులో నీళ్లు పారుతున్నందున మోటారుబండ్లుపోజాలవు. ఇక్కడ వేరేమార్గంకూడాలేదు. రెండురోజులలో నీళ్లుతగ్గి బండ్లు పోవచ్చునని యోంచబడుతోంది.

## అనంతగిరిలోయలో సున్నపుగనులు

### సోడాయాష్‌ఫ్యాక్టరీ నిపుణుల పరిశీలన

విశాఖపట్టణము, జూలై 29: ఆంధ్ర జేశములో కేంద్రప్రభుత్వము సంకల్పించిన "సోడా" ఏష్‌ఫ్యాక్టరీ నిర్మించుటకు - కేంద్రప్రభుత్వపు - అభివృద్ధి ప్రణాళికల అధికారి శ్రీ అధియాగారి అధ్వర్యమున, సోడా ఏష్ ఫ్యాక్టరీకి కావలసిన ముడిపదార్థాలకోసం పర్యటిస్తున్న బృందమువారు అనంతగిరి లోయలో — బుర్రా గుహాల దగ్గర, సున్నపురాయి, బాలచెరువు ఉప్పు పరిశ్రమ కేంద్రములనూ పరిశీలించారు.

సోడాఏష్ ఫాక్టరీ నిర్మాణమునకు రెండుకోట్లు రూపాయలు అవుతుందట. (స్వ. వి.)

## వరలక్ష్మీ వ్రతోత్సవం

నారాయణవరం, జూలై 20: చిత్తూరుజిల్లా నారాయణవరం గ్రామంలోని శ్రీ కళ్యాణ వెంకటేశ్వరస్వామి దేవాలయంలో ఆగస్టు 6.వ తేదీ శుక్రవారం ఉదయం 6 గంటలు మొదలు రాత్రి 8 గంటలవరకు శ్రీ పద్మావతీ తాయార్లకు అభిషేకములు, వేదఘోష పారాయణలతో కూడిన సహస్రనామార్చనలు, దివ్యాభరణాలంకారములతో శ్రీ వరలక్ష్మీ వ్రతోత్సవం జరుపబడునని శ్రీ చిప్పురుల శివరామకృష్ణయ్యగారు తెలుపుచున్నారు.

## ప్రాజెక్టులు: ప్రాచీన శిధిలాలు

### ఉపముఖ్య మంత్రి వుద్ఘాటన

కర్నూలు, జూలై 30: ప్రాచీన శిధిలాలకోసం త్రవ్వకం మున్నగునవి యెప్పుడో భవిష్యత్తులో జరపటమన్నది ప్రాజెక్టుల, భవనాల, నిర్మాణానికి అవరోధంగా వుంటే, అటువాటిలో (ప్రాజెక్టులు వగైరా) చాలాభాగం వదిలివేయాల్సి వస్తుందని ఉపముఖ్య మంత్రి శ్రీ సంజీవరెడ్డి నేడు పత్రికా విలేఖరుల ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

నందికొండ నిర్మాణంలో అమరావతిమునిగిపోయి శాద్ధశిథిల్యాలు మున్నగువాటికైనా కొ. జరుగవలసిన త్రవ్వకం పరిశోధన నిలచిపోవా? అన్న ప్రశ్నకు శ్రీ సంజీవరెడ్డి పైవిధంగా సమాధానమిచ్చారు.

భారత దేశానికి మహోజ్వలమయిన గత చరిత్రకలదనీ, యెక్కడ త్రవ్వకం జరిగినా ప్రాచీనకాలపు విలువగల శిధిలాలు కన్పించగలవనికూడా శ్రీ సంజీవరెడ్డిగారు చెప్పారు. (పి. టి. ఐ.)

## ఆంధ్రకు జోగ్ విద్యుచ్ఛక్తి

కర్నూలు, జులై 30: జోగ్ జలపాతంనుండి విద్యుచ్ఛక్తి కొంతభాగం ఆంధ్రకు సరఫరా కాగలదని ఉపముఖ్య మంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు నేడు చెప్పారు. మద్రాసు ప్రభుత్వం మైసూరు ప్రభుత్వమునకు కల్గించు కొరతను యించుమించు పూడగలదని కూడా వారు వివరించారు.

సుమారు 2500 కిలో వాట్ల జోగ్ విద్యుచ్ఛక్తిని ఆంధ్రప్రభుత్వం కొనుగోలు చేయగలదని తెలుస్తున్నది. ఇటీవల జరిగిన ఉభయ ప్రభుత్వ కార్యదర్శుల సమావేశంలో యీ నిర్ణయం జరిగిందట. (స్వ. వి.)

## రైతుల స్వయం కృషి

అనకాపల్లి, జూలై 29: శారదానది నుంచి ప్రవహించే ఎల్లాయకాలవకట్ట చెడిపోయింది. గత మూడు రోజుల నుంచీ వందలకొద్ది రైతులు ఒక్కటిలో అరటి బోదెలు తెచ్చి కలికొయ్యల పెడి తాత్కాలికంగా కట్ట నిర్మించి శాలా నష్టం తప్పించారు.

## భైరవానితిప్పప్రాజెక్టు

### త్వరలో నిర్మాణం ప్రారంభం

కర్నూలు, జులై 30. సుమారు 1.2 కోట్ల రూపాయల ఖర్చుతో 80 వేల యెకరాలకు ప్రయోజనం చేకూర్చే అనంతపురం జిల్లాలోని భైరవానితిప్ప ప్రాజెక్టు నిర్మాణం త్వరలో ప్రారంభం కావచ్చుని ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు నేడు విలేఖరుల గోష్టిలో చెప్పారు.

ఆంధ్ర మైసూరు ప్రభుత్వ ప్రతినిధులమధ్య ఢిల్లీలో యీ ప్రాజెక్టు విషయమై సంప్రతింపులు జరిగి కొన్ని నిర్ణయాలకు రావటం జరిగిందనీ, వాటిని మంత్రివర్గం పరిశీలించి చివరి నిర్ణయాలు చేస్తుందనీ, తప్పుండం వద్ద కటం అసాధ్యమైందంటే తుంగభద్రాశాఖ ప్రాయా లేనీ లేవని భావించి పనులు పడుతున్నామనీ కూడా శ్రీ సంజీవరెడ్డి వివరించారు.

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ శ్రావణ శు॥ తృతీయ 1954 సం॥ ఆగస్టు 1 ఆదివారం

ఆ॥తృతీయ రా8-58ఘ 11-36 వర్జ్యం 20-8 ల 21-47 వ.

శు॥ చతుర్థి ఆగస్టు 2 సోమవారం

సో॥ చతుర్థి రా 8-0 పూభ 18-3 వర్జ్యం 20-50 ల 22-24 వ.

ఆంధ్రపత్రిక

శ్రీ జయ సం॥ శ్రావణ శు॥ తృతీయ ఆదివారం

## పోర్చుగల్ తీవ్రధోరణి

భారత దేశంలో తమ వరంగావున్న స్థావరాల విషయమై పోర్చుగీసు ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం నాగరిక రాజ్యాలన్నిటి నిరసనకు గురియైనది. భారత ప్రభుత్వ విధానాన్ని సామాన్యంగా హర్షించని ...

... పైనా, భారత ప్రభుత్వంపైనా వికృతమైన ఆరోపణలు చేస్తూ, అంతులేని దుష్ప్రచారాన్ని సాగిస్తున్నది. అలాంటి ప్రభుత్వంతో భారత దేశం ఎంతో కాలం రాజకీయ సంబంధాలను పెట్టుకొని ఉండలేదు. పోర్చుగల్‌తో పూర్తిగా తెగ తెంపులు చేసుకోవలసిన సమయం ఆసన్నమైనదనే చెప్పవచ్చును. పోర్చుగల్ వలసల స్వాతంత్ర్యం కొరకు గోవా జాతీయవాదులు ప్రారంభించిన ఉద్యమంలో భారతీయులు పాల్గొనక తప్పదు. భారత ప్రధానమంత్రి కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్నందువల్ల కాంగ్రెస్‌వాదులు ఈ ఉద్యమంలో పాల్గొనటకు ప్రస్తుతం సందేహించుచుండవచ్చును. కాని పోర్చుగల్ ఇప్పటి దౌర్జన్యచర్యలను తీవ్రతరం చేసి, సైనిక బలప్రయోగానికి ఉపక్రమించిన భారతీయులు పోర్చుగీస్ వలసల విముక్తి ఉద్యమ నిర్వహణ బాధ్యతను స్వీకరింపవలసియుండును. ఫ్రాన్సు, పోర్చుగల్ ప్రాంతాలు భారత దేశాంతర్భాగాలే అని అంగీకరించినప్పుడు వాటివిమోచనకు ఆ ప్రాంత ప్రజల స్వాతంత్ర్య సంపాదనకు కృషిచేయుటభార...

# సహకార సంఘాలు ఇంకా పటిష్ఠంగా పనిచెయ్యడానికి వీలుగా సంస్కరించాలి

## ఆంధ్రరాష్ట్ర సహకార సంఘాల రిజిస్ట్రార్ ఉద్బోధ

కర్నూలు, జూలై 31: గ్రామపరపతి సహకార సంఘాల కార్యక్రమాలను సమీక్షించి, సహకార సంఘాలన్నీ ఇంకా బాగా ప్రజాభ్యుదయ సాధనకు కృషిచేయవలసిన అవసరం ఉన్నదని ఈవేళ ఇక్కడ జరిగిన భారత సహకారోద్యమం కర్నూలుశాఖ స్వర్ణోత్సవసభలో ప్రసంగిస్తూ ఆంధ్ర రాష్ట్ర సహకార సంఘాల రిజిస్ట్రారు కె. సుబ్రహ్మణ్యం నాయుడు గారు అన్నారు.

ఆయన ఇంకా యిలా ప్రసంగించారు:

"మన దేశంలో ప్రభుత్వంనుండి తగు సహాయాన్ని, ప్రోత్సాహాన్ని, సహకారోద్యమం పొందడం నిజంగా హర్షణీయం. గతంలో అధికారవర్గాలకు సహకార ఉద్యమానికి దగ్గిర సంబంధం ఉండడాన్ని గురించి జరుగుతున్న విమర్శల్లోని నిజానిజాలు ఎలావున్నప్పటికీ ఈనాడు దేశంలో మార్పు చెందిన ఆర్థిక పరిస్థితులదృష్ట్యా ప్రభుత్వానికి సహకారోద్యమానికి సన్నిహిత సంబంధం ఏర్పడక తప్పదు.

"శ్రేయోరాజ్య స్థాపనను కోరుతున్న ప్రభుత్వం సహకారోద్యమం వంటి ప్రజోద్యమాన్ని దానికిగల శక్తి సామర్థ్యాల మేరకు ఆర్థిక సాంఘిక ప్రణాళికలను కొనసాగింప చేయటానికి వినియోగించుకోటం సహజమే. అదీ కాక సహకార ఉద్యమం తన ప్రత్యేకతను వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవలసి వుండగా...

"పట్టణాలలోని సహకారపరపతి సంఘాలు, గృహనిర్మాణ సంఘాలు, వినియోగదార్ల సంఘాలు సక్రమంగానూ సంతృప్తికరంగానూ పనిచేస్తున్నవి. బస్తీలలో 400 రకరకాల పరపతి సహకారసంఘాలు 114 వేలమంది సభ్యులలో 289 లక్షల రూపాయల నిర్వహణనిధితో పనిచేస్తున్నవి. మధ్య తరగతులకూ కళాకారులకు వ్యాపారస్థులకు ఉద్యోగులకూ తదితరవర్గాలకు అవి ఎంతో సహాయాన్ని చేస్తూ, వారిలో బాంకింగ్ అలవాటును పెంపొందించుటకూ అధికసంఖ్యాకులుగా వున్న క్రిందివర్గాల స్వల్ప ఆదాయాలను సహకారోద్యమంలోకి సమీకరిస్తున్నవి. వీటిలో డిపాజిట్ల మొత్తం 145 లక్షల రూపాయలు. సహకార గృహనిర్మాణసంఘములు అభివృద్ధిచెందుతున్నవి. ప్రాధాన్యతకలిగిన ప్రతి పట్టణమూ వాటి ఫలితాలను పొందుతున్నది. 116 సహకార గృహనిర్మాణసంఘాలు, 9846 మంది సభ్యులతో ...

పడినప్పటికీ, అది అతిస్వల్పమని చెప్పక తప్పదు.

"మంచి మూలధనంతోనూ, శిక్షణ పొందిన సిబ్బందితోనూ హెచ్చు సంస్థలలో గ్రామీణ బాంకులకు, స్థానికులలో నమ్మకాన్ని కలిగించి, స్థానికుల స్వల్ప ఆదాయాలను సమీకరించి సద్వినియోగం చేసి రకరకాల హామీల మీద అప్పులు యిస్తూ నమ్మకమయిన బాంకింగు సౌకర్యాలు ఏర్పాటు చేస్తూవుండేటట్లు చెయ్యటం ఒకమార్గంగా కనిపిస్తున్నది. రైతుల అవసరాలు విభిన్నంగానూ, అనేకంగానూ ఉన్నవి. రాకపోకల సౌకర్యాలు ఎక్కువ అవుతున్నవి. ఈ మార్పులన్నింటి ఫలితం మన వ్యవసాయ పరపతి సహాయ పద్ధతులపై ప్రతిఫలించుతున్నవి. ఒకవిధంగా చూస్తే సహకార పద్ధతి చాలా క్లిష్టమైన పద్ధతులలో కూరుకొన్నది. ప్రజాస్వామ్య పద్ధతిలో నిర్వహణకు కఠినమైన వ్యాపార నియమాలకు సమన్వయం కుదర్చడానికి ఇది ప్రయత్నిస్తున్నది. మార్పు చెందుతున్న, అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలోపాటు మార్పులు చెందటం ఇలాంటి పౌర విధానాలకు చాలా కష్టంగానే ఉంటుంది.

### రైతుల సమస్యలు

"సకాలంలో ఉత్పత్తి సంబంధమైన ఆర్థిక సహాయానికి మార్కెటింగ్ సౌకర్యాలకు సంబంధించిన ఆర్థిక సహా...

### సంస్కరణ అవసరం

### పలురకాల సంఘాలు

### ఉద్యమ వ్యతిరేకుల హృదయపరివర్తనం

### విద్యార్థుల నిరాహారదీక్ష విరమణ

### వర్తకుల హర్తాళం

# ఆంధ్ర ప్రభుత్వ బంజరు భూముల పంపిణీ విధానంలోని సుగుణాలు

## రెవిన్యూమంత్రి శ్రీ కోటిరెడ్డిగారి వివరణ

భూ దేవి రత్నగర్భ యనుటలోను, భారతదేశాన్ని తల్లితో పోల్చి భారతమాతా యనుటలోను అతిశయోక్తి యేమీ లేదు. దానికి కారణము మానవ జీవితమే కాకుండా సకల జీవరాసులు కూడా భూమాతపై ఆధారపడి ఉండుటయే. భూసంపద ఉన్నచో కల్పవృక్షమును కామధేనువును పొందియున్నట్లే. భూమి లేనిచో మరి యే సిరియు వుండుటకు అవకాశముండదు. అట్టి సర్వసంపదలను తనలో నిగూఢపరచుకొనియున్న భూసంపద మన దేశములో ఎంతో వున్నది. కాని, మన ప్రజలు బీదలు. చెప్పుకోవలసిన స్థితిగతులు చాలా వున్నవి. ప్రస్తుతము అన్నిటికంటె ప్రధానమయిన ఒక భూసంపద వినియోగాన్ని గురించి పరిశీలింతము.

ప్రపంచమంతా పారిశ్రామికముగా మారిపోయినా నవీన పారిశ్రామిక యంత్ర గారడితో వాయు వేగంతో వ్యాపించే యీ రోజులలో మన దేశములో యిప్పటికీ, ఇంకా కొన్ని వేల సంవత్సరముల వరకు కూడ మన ప్రజానీకానికి అతి ముఖ్యమయిన పరిశ్రమ అత్యుత్తమమయిన జీవనోపాధి వ్యవసాయమే. కోట్లకొలది ప్రజలు అనగా 80 శాతము నేటికి ఎనభైమంది మన దేశములో వ్యవసాయమువలననే జీవించుచున్నారు. అయినా భూములు లేని నిరుపేదలు కోట్లకొలది ఉన్నారు...

రద్దు పరచినది. జమీందారీ రద్దువలన 1-7-45కు ముందు గతానుభవములో యున్న భూములన్నిటికి రైతులకు పట్టాలివ్వబడును.

### ఆంధ్రలో ఇంతవరకు జరిగిన పని

ఆంధ్ర ప్రభుత్వము ఆంధ్రరాష్ట్రావతరణ నుండి కూడ బహువిధములైన ఆలోచనలు జరిపి, అనేక సంప్రదింపులు జేసి, తుదకు ప్రభుత్వ స్వాధీనములో నున్న అనాక్షేపణీయమయిన బంజరుభూములను మంజూరు జేయు విధానమును అమలుపరచుటకు ఉత్తరువులిచ్చారు.

ఆంధ్రదేశములో ప్రభుత్వ స్వాధీనమున దాదాపు పదమూడు లక్షల ఎకరముల కు పైగా అనాక్షేపణీయమైన సాగుకు లాయకగు బంజరు భూములున్నట్లు అంచనా వేయబడినది. ఈ భూములను భూములులేని రైతులకు మంజూరు చేయుటకు ఆంధ్ర ప్రభుత్వం రెవిన్యూ ప్లానింగ్, ఆర్థిక మంత్రులతో ఒక సబ్ కమిటీ (ఉపసమితి)ని యేర్పాటు చేశారు. వారి సమాలోచనలపై 1954 జూన్ 18వ తేదీన 1142వ జి. వో. ఇచ్చారు. దానిలో బంజరు భూముల మంజూరు విధానాన్ని విశదీకరించారు. తదనంతరము గౌ॥ ఉపప్రధానమంత్రి రెవిన్యూమంత్రి, విద్యా పరిశ్రమల మంత్రులతో మరొక సమాలోచన జరిగింది. వీరు రెవిన్యూబోర్డు మెంబరుతోను, కొంతమంది జిల్లా కలెక్టర్లతోను ...

... స్వాధీనాల్లో వుంచుకొన్నచో, ఆ హెచ్చు పరిమితినుండి మాత్రము వారి తోలగింపబడుదురు. ఆ అక్రమణ వారి అనుభవములో కూడిన శిస్తు ... అయినప్పటికి ఆ భూములు విస్తీర్ణము విడుదలచేసి బీదలకు పంచి పెట్టబడును. ఒకరొకరికి గాంగ్ భూమి రెండు ఎకరాల మెట్ట భూమిగా పరిగణింపబడునని ఈ సందర్భములో గమనించేది.

ఈ పద్ధతిపై మంజూరు చేయబడిన భూములను ఆయా బీదరైతులు మంజూరుదారులు మంజూరుచేసిన తేదీనుండి మూడు సంవత్సరములలోపుగా స్వయంకృషివల్ల, స్వయంగా కుటుంబ కృషివల్ల కాని, కూలీల సహాయముతో గాని, సాగుబడికి తీసుకురావాలి. ఈ సందర్భములో రాజకీయబాధితుల విషయములో కూడ కొంతవరకు పరిశీలించవలసి వచ్చినది. మద్రాసు ఉమ్మడి ప్రభుత్వము ఉత్తరువులవల్ల వారికి యివ్వబడిన తాత్కాలికముగా మంజూరు చేయబడిన భూములు కూడ అసైన్ చేయబడినవి. వాటి విషయములో తిరిగి పరిశీలన చేసి, తగుచర్య తీసుకోబడును. రాజకీయబాధితులు దరఖాస్తు పెట్టుకొన్న తేదీనాటికి భూములులేని బీదల అనుభవ ఆక్రమణలో నున్న భూములు తప్ప, మిగత అనాక్షేపణీయమయిన బంజరుభూములు మంజూరు చేయు విషయము కూడ పరిశీలించబడును.

### ప్రత్యేక విశేషాలు

### చెరువు భూములు

### పత్రనిస్తాన్

### సరిహద్దురాష్ట్ర ముఖ్యమంత్రి ప్రకటన



### శోకభారం

### ఏకకాలాన ముగ్గురు పిల్లల మరణం

# వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

## ౬౧

ఆ యజ్ఞానికి వచ్చినవారు అందరూ వెళ్ళిపోయిన తరువాత విశ్వామిత్రుడు ఆ తపోవనములో ఉన్నవారు అందరితోనూ "నేను దక్షిణ దిశకు వచ్చిన తరువాత నా తపస్సుకు పెద్ద విఘ్నము అయింది అని ఇంకొక దిక్కుకుపోయి తపస్సు చేసుకోవటము మంచిది అని పడమటి దిక్కున విశాలము అయిన తపోవనాలు ఎన్నో ఉన్నవి అని పుష్కరతీర్థతీరాన సుఖముగా తపస్సు చేసుకోవచ్చును అని చెప్పి అనుచరులు అందరితోనూ ప్రయాణము అయి పడమటి దిక్కుగా పోయినాడు. పుష్కరతీర్థము చేరినాడు.

ఫలమూలాలను మాత్రమే ఆహారముగా చేసుకొని మహోగ్రముగానూ అనివార్యముగానూ విశ్వామిత్రుడు తపస్సు చేయ నారంభించినాడు.

ఆ కాలములో అయోధ్యానగరములో అంబరీషుడు అనే రాజు రాజ్యపాలనము చేస్తూ ఉన్నాడు. ఆయన ఒక యజ్ఞము ఆరంభించినాడు. ఆ యజ్ఞము జరుగుతూ ఉండగా దేవేంద్రుడు యజ్ఞపశువును దొంగిలిపోయినాడు. ఆ పశువు కనపడకుండా పోయినందువల్ల పురోహితుడు "ఓ రాజా, నీవు పరాకుగా ఉన్నందువల్ల నీ యజ్ఞ పశువును ఎవరో ఎత్తుకొని పోయినారు. ఈ దోషము నిన్ను నాశము చేసి వేస్తుంది. ఇందుకు ప్రాయశ్చిత్తము చాలా కష్టము అయింది. కాబట్టి యజ్ఞకర్మను ఆరంభము చేసేలోపల యజ్ఞపశువును కాని ఆ పశువు దొరకక పోయేట్లయితే ఒక నరపశువును కాని పట్టుకొని రావలెను. ఈ పని వెంటనే చేయవలెను" అన్నాడు.

అంబరీషుడు తెలివితేటలు కలవాడు, వేలకొద్దీ ఆవులను వెంటతీసుకొని యజ్ఞపశువును వెతకడానికి బయలుదేరినాడు. దేశదేశాలూ మహానగరాలూ జనపదాలూ పుణ్యాశ్రమాలూ ఎన్నో వెదకినాడు. కాని ఎక్కడను ఆయన యజ్ఞ పశువు దొరకలేదు. చివరకు భృగుతుంగము అనే పర్వత ప్రదేశములో భార్యాపుత్రులతో ఉంటూ ఉన్న రుచీక మహర్షిని చూచినాడు.

అంబరీషుడు తపోదీప్తులతో తేజరిల్లుతూ ఉన్న ఆ రుచీకమహర్షిని సత్కరించి సంతోషపెట్టినాడు. నమస్కారము చేసి కుశలము అడిగి తెలుసుకొని "మహర్షీ, నా యజ్ఞ పశువు కనపడకుండా పోయింది. దేశదేశాలూ తిరిగినాను. ఎక్కడనూ దొరకలేదు. మీ ముగ్గురి కొడుకుల్లో ఒకరిని నాకు యజ్ఞపశువుగా విక్రయించ ప్రార్థిస్తున్నాను. నేను కృతార్థుణ్ణి అవుతాను. ఇందుకు తమకు నేను ఒక లక్షగోవులను ఇస్తాను." అని అంబరీషుడు చెప్పినాడు.

"రాజా, నీవు ఏమి ఇచ్చినా నా పెద్ద కుమారుణ్ణి ఇవ్వను" అన్నాడు రుచీకుడు.

ఆయన ఇల్లాలు మహా తపస్విని. ఆమె అది విని "ఓ రాజా, మహాభాగుడు నా పెనిమిటి పెద్దపిల్లవాణ్ణి అమ్మను అన్నాడు. కడగొట్టువాణ్ణి అమ్మడానికి నేను ఒప్పుకోను. ఏమంటే తరుచూ తండ్రికి పెద్దపిల్లవాడు అంటే ఇష్టము; తల్లికి కడపటివాడిమీద మోజు. అందువల్ల పసివాణ్ణి నేను అట్టిపెట్టుకొంటాను" అన్నది.

తల్లిదండ్రులు చెప్పుతూ ఉన్నది వింటూ ఉన్న నడిమివాడు శునశ్శేపుడు "రాజా, మా నాయన పెద్దవాణ్ణి అమ్మను అన్నాడు. మా అమ్మ చిన్నవాణ్ణి అమ్మడానికి వీలులేదు అన్నది. మధ్యవాణ్ణి నన్ను వారు అమ్మివేసినట్లే ఎంచుకోవచ్చును. కాబట్టి లక్ష గోవులూ మా తండ్రికి ఇచ్చివేసి తాము నన్ను తీసుకొని వెళ్ళవచ్చును" అన్నాడు.

అందుకు అంబరీషుడు అమిత సంతోషముగా రుచీకుడికి లక్షగోవులూ ఇచ్చి శునశ్శేపుణ్ణి తనరథము ఎక్కించుకొని తత్‌క్షణమే బయలుదేరినాడు.

## ౬౨

ఓ రామా, అంబరీష మహారాజు శునశ్శేపుణ్ణి రథముమీద తీసుకొనిపోతూ ఉండగా మిట్టమధ్యాహ్నము అయింది. పుష్కరతీర్థము చేరినారు. అక్కడ ఆ మహారాజు విశ్రమించినాడు.

ప్రాణముపోతుంది అనే దిగులుతో శునశ్శేపుడిముఖాన కళాకాంతులూ మాసిపోయినవి. ప్రయాణమువల్ల అలసిపోయినాడు. దాహము వేసింది. నీళ్ళ దగ్గరకు పోయినాడు. అక్కడ ఋషులతోకూడా తపస్సు చేసుకొంటూ ఉన్న విశ్వామిత్రుణ్ణి చూచినాడు. పరుగెత్తుకొంటూపోయి ఆయన పాదాలమీద పడ్డాడు.

"ఓమహర్షి, నాతల్లిదండ్రులు నన్ను యజ్ఞపశువుగా అంబరీషమహారాజుకు అమ్మివేసినారు. ఇక నాకు తల్లీ తండ్రీ నీవే. జ్ఞాతిఅయినా బంధువు మిత్రుఅయినా గురువు అయినా నీవు ఒక్కడవే నాకు ఉన్నావు. నీవు దయానిధివి. అడిగినవాణ్ణి కాదు అనకుండా కాపాడుతూ ఉన్నావు. దయామతితో నీవు నన్ను బ్రతికించవలెను. అయితే లక్షగోవులు ఇచ్చి నన్ను కొనుక్కున్న అంబరీషమహారాజు యజ్ఞము చెడిపోకూడదు. నాకు ఆయుర్దాయము అనుగ్రహించవలెను. నేను కామభోగార్థము ఆయుర్దాయము అనుగ్రహించవలెను అని ప్రార్థించడములేదు తపస్సు చేయడానికి నేనుఆయువుఅర్థిస్తున్నాను. నేను ఇప్పుడు దిక్కులేనివాణ్ణి ఈ ఆపత్కాలములో తాము నన్ను తమ పుత్రుడు వలె రక్షించవలెను" అంటూ శునశ్శేపుడు వేడుకొన్నాడు.

విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి ఓదార్చి తన కుమారులను చూచి "ఓ పుత్రులారా, మీరు పుత్రులుగా నాకు అక్కరకు వచ్చేదీ లేనిదీ తెలుసుకోడానికి ఇప్పుడు సమయము వచ్చింది. తండ్రి కోరికలను సఫలము చేయడమే కొడుకులకు పరమధర్మము ఈ చిన్నవాడు ముని పుత్రుడు. ప్రాణముకోసము నా శరణు జొచ్చినాడు. వీడిప్రాణము కాపాడి నన్ను మీరు సంతోషపెట్టవలెను. మీరు అందరూ పుణ్యకర్ములు. ధర్మపరాయణులు. మీలో ఒకరు అంబరీషుడికి యజ్ఞపశువుగాపోయి ఈ శునశ్శేపుణ్ణి బ్రతికించవలెను. అట్లా చేసేట్లయితే అంబరీషుడి యజ్ఞమూ నెరవేరుతుంది, ఈ శునశ్శేపుడున్నూ బ్రతుకుతాడు; మీరు అందరూ నా మాట పాటించినవారున్నూ అవుతారు" అన్నాడు.

విశ్వామిత్రుడి పుత్రులు మధుష్యందాదులు సాభిమానముగానూ పరిహాసముగానూ, "ప్రభూ, తమ స్వంతబిడ్డలను వదిలిపెట్టి పరాయిపిల్లవాణ్ణి కాపాడబోవటము మధురాహారము వదిలిపెట్టి శ్వమాంసాహారముకోసము తాపత్రయపడడముగా ఉంది. ఇది మాకు ఆశ్చర్యముగా తోస్తూ ఉంది" అన్నారు.

కొడుకులు అన్న మాటలకు విశ్వామిత్రుడికి కోపము వచ్చింది. కన్నులు ఎఱ్ఱచేసి "తండ్రికి ఎదురు ఆడకూడదు అనే భయము లేకపోవడమే కాకుండా ధర్మరహితముగానూ దారుణముగానూ మాట్లాడినారు. నాఒండ్లు గరు పుట్టించినారు. మీరున్నూ వాసిష్ఠులవలె ముష్టికులుఅయిపోయి కుక్కమాంసముతింటూ ఈ భూమిమీద బహుకాలము బ్రతికిఉండవలెను" అని శాపము పెట్టినాడు.

దిగులుపడిపోయిఉన్న శునశ్శేపుడికి ఏ బాధాలేకుండా పోవడానికి అంతట విశ్వామిత్రుడు విధూతమంత్రించి రక్షపెట్టి "ఓ పిల్లవాడా నీకు రెండు మంత్రాలు ఉపదేశము చేస్తాను. నిన్ను యూపస్తంభానికి కట్టివేయగానే నీవు ఆ రెండు మంత్రాలూ జపము చేయవలెను. అంతట ఇంద్రోపేంద్రులు నిన్ను రక్షిస్తారు నీకు జీవితసిద్ధి కలుగుతుంది" అంటూ రెండు మంత్రాలూ ఉపదేశించినాడు.

శునశ్శేపుడి మనస్సు కుదుటపడ్డది. అతడు అంబరీషమహారాజు దగ్గరకు పరుగెత్తుకొనిపోయి "రాజా, ఆలస్యము చేయవద్దు. ఇక్కడనుంచి ఇప్పుడే వెళ్ళిపోదాము. తాము యజ్ఞకర్మను శీఘ్రముగా ముగించవచ్చును" అని చెప్పినాడు. ఆమాటలకు అంబరీషుడు సంతోషపడ్డాడు. ఉత్సాహముతో బయలుదేరినాడు. ఏ మాత్రమూ జాగుచేయకుండా యజ్ఞశాల ప్రవేశించి పురోహితుడి అనుమతితో యజ్ఞకర్మను ఆరంభించినాడు.

శునశ్శేపుడి ఒంటినిండా గంధము పూసినారు. రక్తమాల్యాంబరాలతో అలంకరించినారు యజ్ఞపశువుగా అతనిని యూపస్తంభానికి కట్టివేసినారు. అచల నిష్ఠతో శునశ్శేపుడు విశ్వామిత్రుడు ఉపదేశించిన రెండు మంత్రాలూ జపము చేయడము మొదలు పెట్టినాడు

ఇంద్రోపేంద్రులు సంతృప్తులు అయినారు. శునశ్శేపుడికి దీర్ఘాయువును ఇచ్చినారు అంబరీషుడికి యజ్ఞఫలము బహుగుణముగా అనుగ్రహించినారు.

## ౬౩

ఆ పుష్కర తీర్థాన విశ్వామిత్రుడు బహుకాలము తపస్సు చేసినాడు. తపోవ్రతము అయిపోతూ ఉండగా బ్రహ్మదేవుడు దేవతలను అందరినీ వెంటపెట్టుకొనివచ్చి విశ్వామిత్రుణ్ణిచూచి "నీకు శుభము అవుతుంది. ఇంతవరకూ నీవు చేసిన శుభకర్మలకు నిన్ను ఒక ఋషిగా పరిగణిస్తున్నాను"అంటూ పరివారముతో అంతర్ధానము అయినాడు

విశ్వామిత్రుడు అసంతృప్తుడు అయినాడు. మళ్లీ తపస్సు చేయడము మొదలుపెట్టినాడు బహుకాలము అయిపోయింది. ఒకనాడు ఆ పుష్కర తీర్థములో మేనక అనే అప్సరస జలకమాడటానికి వచ్చింది. మేఘాలలో మెరుపుతీగవలె ఆమె విశ్వామిత్రుడి కన్నులలో మెరిసింది. మునుడు అయినాడు. ఆమె అప్రతిమాన సౌందర్యానికి మన్మథవశుడు అయిపోయినాడు. ఆమెను చూసి "ఓ అప్సరసా, స్వాగతము. నీవు నా ఆశ్రమములో ఉండవలెను. నీకు శుభము అవుతుంది నిన్ను నేను మోహించినాను. నీవు నన్ను ఏలుకోవలసింది" అన్నాడు.

ఓ రామా, ఆ మేనక అక్కడ విశ్వామిత్రుడితో కాపురము చేసింది. ఒకటే పది సంవత్సరాలు అయిపోయినవి అప్పుడు విశ్వామిత్రుడికి సిగ్గువేసింది శోకపరవశుడు అయిపోయినాడు. లోలోపల చింతించినాడు. ఇది అంతా దేవతలు తన తపస్సు చెడగొట్టడానికి పన్నిన పన్నాగము అని తెలుసుకొన్నాడు. మోహానికి లొంగిపోయినందువల్ల పది సంవత్సరాలూ ఒక్క అహోరాత్రముగా గడచిపోయినవే అని విచారపడ్డాడు. కామాతురతవల్ల ఇంతటి విఘ్నము అయిపోయింది అని పశ్చాత్తాపపడ్డాడు. దుఃఖముతో కుమిలిపోతూ నిట్టూర్పులు విడుస్తూ మేనకవంక చూచినాడు.

మేనక భయపడిపోయింది. గజగజ వణికింది. చేతులు కట్టుకొని నిలుచున్నది.

విశ్వామిత్రుడు ఆమెకు తియ్యని మాటలు చెప్పి అక్కడ ఉండకుండా ఉత్తర దిక్కుగా బయలుదేరి పోయినాడు.

ఆ విధముగా మేనకను వదిలించుకొన్న విశ్వామిత్రుడు హిమవత్పర్వత పార్శ్వములో కౌశికీ నదీతీరానికి పోయినాడు. ఇంద్రియాలను జయించవలెను అనే దృఢ సంకల్పముతో దారుణము అయిన తపస్సు మొదలు పెట్టినాడు.

చాలాకాలము అయిపోయింది. ఆయన మహోగ్రతపస్సుకు దేవతలు అందరూ భయపడిపోయినారు. వారు అందరూ బ్రహ్మదేవుడితో విశ్వామిత్రుడి దగ్గరకు పోయినారు. బ్రహ్మదేవుడు "ఓ విశ్వామిత్రుడా, నీమహోగ్రతపస్సుకు మెచ్చుకొన్నాను. నీఋషిముఖ్యత్వమూ నీమహాత్మ్యమూ గమనించినాను. ఇకను ఇంతట నుంచీ నిన్ను మహర్షిగా భావిస్తాను" అన్నాడు.

బ్రహ్మదేవుడి మాటలకు విశ్వామిత్రుడు సంతోషించనూలేదు, కించపడనూలేదు. నమస్కారము చేసి "స్వామీ, నేను మహర్షిని అయినాను అని తాము అంటున్నారు. అయితే నేను జితేంద్రియుణ్ణి అయినట్టు తాము అంగీకరిస్తారా" అని బ్రహ్మదేవుణ్ణి ప్రశ్న చేసినాడు.

"నీవు జితేంద్రియుడవు కాలేదు. ఇంకా నీవు సాధన చేయవలెను" అంటూ బ్రహ్మదేవుడు దేవతలు అందరితోనూ అంతర్ధానము అయిపోయినాడు.

విశ్వామిత్రుడు అంతట మళ్లీ తపస్సు చేయటము ఆరంభించినాడు. ఈ మాటు ఆయన రెండు చేతులూ పైకి ఎత్తి ఏ ఊతమూ లేకుండా నిలుచుని వాయుభక్షణము చేస్తూ వేసంగి ఎండలో నాలుదిక్కులా అగ్నిహోత్రాలు ఉంచుకొనీ వానాకాలములో అనాచ్ఛాదిత ప్రదేశములో ఉండీ చలికాలములో జలమధ్యములో ఉండీ మహా తీవ్రముగా తపస్సు చేయసాగినాడు. బహుకాలము గతించింది.

## ౬౪

విశ్వామిత్రుడి దారుణ తపస్సుకు దేవతలూ దేవేంద్రుడూ కలతపడిపోయినారు. వారు సభతీరి రంభను రావించినారు.

దేవేంద్రుడు "ఓరంభా, మహత్తరము అయిన దేవకార్యము ఒకటి నీవు సాధించవలెను. నీవు ఇప్పుడే ఇక్కడనుంచి పోయి విశ్వామిత్రుణ్ణి వ్యామోహపెట్టవలెను. అతడు నిన్ను తనుజేకొనేట్టు చేయవలెను" అన్నాడు.

రంభ అది తనవల్లను అయ్యే పని కాదు అని సిగ్గుపడిపోయింది. దేవేంద్రుడికి నమస్కారము చేసి "ఓ సురేశ్వరా, ఆయన మహాముని. పరమ భయంకరుడు. నేను ఏమి చేయబోయినా ఆయనకు కోపము వస్తుంది. ఘోరముగా శపిస్తాడు. సందేహములేదు. దేవా, నాకు భయము వేస్తూ ఉంది. నన్ను అనుగ్రహించవలెను" అంటూ గజగజ వణికి పోయింది.

"ఓ రంభా, నీవు భయపడవద్దు. నీకు శుభము అవుతుంది. నేను చెప్పినట్లు నీవు చేయవలెను. మనోహరము అయిన వసంతకాలములో నేనూ మన్మథుడూ నీవెంట వస్తాము. నేను కోకిల రూపముతో నీ సరసను ఉంటాను. నీతో మన్మథుడు నీనీడ మాదిరిగా ఉంటాడు. నీవు చక్కగా సింగారించుకొని నీశృంగార చేష్టలతో విశ్వామిత్రుడి తపస్సు చెడగొట్టవచ్చును. నీవు ఈ పని ఇట్టే చేయగలుగుతావు" అని రంభను సమాధాన పరచినాడు.

రంభ విశ్వామిత్రుణ్ణి మరులుకొల్పడానికి జగన్మోహనముగా అలంకరించుకొని చిరునవ్వులతో బయలుదేరింది. అది వసంతకాలము. చెట్లు అన్నీ పూలు పూసినవి. కోకిల మనోహరముగా కూయసాగింది. రంభ రాగము ఆలాపించింది. ఆ అప్రతిమాననాదానికి విశ్వామిత్రుడి మనస్సు ఉర్రూతలూగింది. కన్నులు తెరచి చూచినాడు. ఎదుట రంభ కనుపించింది. వెంటనే సందేహము వచ్చింది. అది అంతా దేవేంద్రుడు చేస్తున్న తంత్రము అని స్ఫురించింది. క్రోధపరవశుడు అయిపోయి "ఓ దౌర్భాగ్యురాలా, కామక్రోధాదులు జయించవలెను అనుకొంటున్న నన్ను మరులు కొల్పడానికి వచ్చినావా; నీవు శిలవుఅయిపో, బహుకాలము అట్లా శిలవు అయి పడిఉండు" అని శాపము పెట్టినాడు.

పట్టరాని కోపము వచ్చి శాపము పెట్టినందుకు విశ్వామిత్రుడు ఉత్తరక్షణములో పశ్చాత్తాపపడి పోయినాడు. అంతట ఆ రంభను చూస్తూ "ఓ రంభా మహా తేజోవంతుడూ తపోబలసమన్వితుడూ అయిన బ్రాహ్మణుడు ఒకడు నా శాపమునుంచి నిన్ను ఉద్ధరించ కలుగుతాడు." అన్నాడు.

విశ్వామిత్రుడి శాపవాక్కులు చెవులపడగానే దేవేంద్రుడూ మన్మథుడూ అక్కడనుంచి పారిపోయినారు.

రంభ అప్పటికి అప్పుడే రాయి అయిపోయింది.

కోపాన్ని జయించలేకపోయినందుకు విశ్వామిత్రుడు విచారపడిపోయినాడు. ఆకోపమువల్ల తన తపోబలము కొంత తగ్గిపోతూ ఉంది అని గమనించినాడు. అరిషడ్వర్గాన్ని జయించలేకపోయినందుకు ఖిన్నుడు అయినాడు. మనశ్శాంతిలేకుండా పోయినందుకు వ్యథపడ్డాడు.

ఎవరు ఏమిచేసినా కోపపడకూడదు అనీ ఎవరు ఏమి మాట్లాడినా మొదలకుండా ఊరకోవలెను అనీ మనసా నిశ్చయించుకొన్నాడు. అంతే కాదు. జితేంద్రియుడు అయ్యేటంతవరకున్నూ దేహాన్ని ఎండకట్టవలెనుఅనీ తపస్సుప్రభావమే ఉంటే సహజముగా తేజము అయిపోదు అనీ బ్రహ్మర్షి అయ్యేటంతవరకున్నూ అన్నము తినకుండా నీళ్ళు తాగకుండా చివరకు ఊపిరి అయినా విడవకుండా తపస్సు చేయవలెను అని సంకల్పించుకొన్నాడు.

ఓ రామా, ఈ విధముగా విశ్వామిత్రుడు అప్రతిమానముగా శపథము చేసినాడు.

## ౬౫

ఓ రామా, విశ్వామిత్రుడు హిమవత్పర్వత ప్రాంతము వదిలిపెట్టి తూర్పు దిక్కుగా పోయినాడు. అక్కడ నిరుపమానము అయిన మౌనవ్రతము అవలంబించినాడు. అప్రతిమానమూ పరమదుష్కరమూ మహోగ్రమూ అయిన తపస్సు చేయటము మొదలుపెట్టినాడు. కోపాన్ని దరిజేరనీయకుండా ఎన్ని విఘ్నాలువచ్చినా ఏ మాత్రమూ చలించకుండా మానుమాదిరిగా పాదుకొనిపోయినాడు.

ఆవిధముగా నియమబద్ధుడు అయి ఏ అంతరాయానికీ లొంగిపోకుండా బహుకాలము తపస్సు చేసినాడు. ఆయన తపోవ్రతము సమాప్తము అయింది. అప్పుడు ఆయన భోజనము చేయబోతున్నాడు. ఇంతలో దేవేంద్రుడు బ్రాహ్మణవేషములో వచ్చి అన్నము పెట్టమని యాచించినాడు. తిరస్కరించకుండా నిస్సంకోచముగా ఆబ్రాహ్మణుడికి సిద్ధాన్నము పెట్టినాడు. ఆ బ్రాహ్మణుడు ఆ అన్నము ఏ కొంచెమూ మిగల్చకుండా అంతా తినివేసినాడు. విశ్వామిత్రుడు ఈషణ్మాత్రమూ చలించలేదు.

విశ్వామిత్రుడు మళ్ళీ ఊపిరి బిగబట్టి మహోగ్రముగా తపస్సు చేయటము మొదలుపెట్టినాడు. చాలాకాలము గతించింది. ఆయన తపస్సు చాలించలేదు. అప్పుడు ఆయన తలలోనుంచి పొగలూ మంటలూ బయలుదేరినవి. అవి ముల్లోకాలలో వ్యాపించినవి. అంతా దగ్ధము అయిపోయేట్టుగా తోచింది. ఆయన తపోగ్నికి దేవదానవయక్షరాక్షస గరుడగంధర్వులు అందరూ నిశ్చేష్టులు అయిపోయినారు.

దేవతలు అందరూ బ్రహ్మదేవుడితో "ఓ దేవా, మేము విశ్వామిత్రుణ్ణి అనేకవిధాల ప్రలోభపెట్టినాము. కోపము తెప్పించడానికి ఎన్నో ప్రయత్నాలు చేసినాము. ఇంకా ఏమేమో చేసినాము. ఏమిచేసినప్పటికిన్నీ ఆయన తపస్సు తరిగిపోలేదు. పయిగా అది వృద్ధిఅయింది. ఇప్పుడు ఆయనలో ఏదోషమూ కనిపించటములేదు. అందువల్ల ఆయన మనసారా కోరుతున్న కోరికను తాము చెల్లించితీరవలెను. అట్లా చేయకపోయేట్లయితే విశ్వామిత్రుడి తపోగ్నికి ముల్లోకాలూ భస్మములుఅయిపోతవి. ఇప్పటికే దిక్కులన్నీ కలవరపడిపోయినవి. సముద్రాలు అన్నీ అల్లకల్లోలముఅయినవి. పర్వతాలు అన్నీ కదులుతూ ఉన్నవి. పృథివిఅంతా వణికిపోతూ ఉంది. గాలి ఎడాపెడా కొట్టుతూవుంది. సూర్యరశ్మి మందగించింది. జనులు కర్మశూన్యులు అయిపోయినారు. ఏమిచేయవలెనో ఎవరికీ తోచటములేదు. అందరికీ నాస్తిక్యము వచ్చినట్టుగా ఉంది.

ఓ దేవా, విశ్వామిత్రుడు అమిత తేజోవంతుడు. ఇప్పుడు అగ్నిహోత్రుడివలె ఉన్నాడు. ఈలోకాలను అన్నిటినీ నాశనము చేయవలెను అని ఆయనకు ఇంకా బుద్ధిపుట్టలేదు. తాము ఉపేక్షించి ఊరకుండేట్లయితే ఆయన ప్రళయకాలాగ్నివలె ముల్లోకాలనూ దహించివేస్తాడు. దేవరాజ్యము ఏలవలెను అని కూడా అనుకొంటాడు. అందువల్ల తాము ఇప్పుడు ఆయన కోర్కెను చెల్లించటమే తరణోపాయము." అన్నారు.

అంతట బ్రహ్మదేవుడు దేవతలు అందరితోనూ విశ్వామిత్రుడు దగ్గరకు పోయినాడు. "ఓ బ్రహ్మర్షీ" అని మనోహరముగా సంబోధించి "నీకు స్వాగతము. నీ తపస్సుకు మేము అందరమూ సంతోషించినాము. నీవు ఇప్పుడు బ్రాహ్మణుడవు. అయినావు. ఓ బ్రహ్మర్షీ, నీకు నేనూ మరుద్గణాలూ దీర్ఘాయుష్యము ఇస్తున్నాము. ఇక నీవు స్వస్థచిత్తుడవు కావలెను. సుఖముగా ఉండవలెను" అన్నాడు బ్రహ్మదేవుడు.

విశ్వామిత్రుడు సంతోషముతో బ్రహ్మదేవుడికీ మిగతా దేవతలకూ నమస్కారము చేసి "ఓ దేవా, నాకు బ్రాహ్మణత్వమూ దీర్ఘాయుర్దాయమూ అనుగ్రహించినందుకు కృతజ్ఞుడను, అయితే ఓంకారమూ వషట్కారమూ వేదాలూ నా స్వాధీనము కావడమే కాకుండా నేను వాటిని ఇతరులకు ఉపదేశము చేసే అధికారమూ తాము నాకు దయచేయవలెను.

ఓ దేవా, ఇంతకన్నా ముఖ్యము అయిన కోరిక మరిఒకటి ఉంది. వసిష్ఠ మహర్షి క్షత్రవేదవిదులలోనూ బ్రహ్మవేదవిదులలోనూ మహామహుడు. ఆయన నన్ను బ్రహ్మర్షి అనవలెను. ఇది నా ముఖ్యముఅయిన కోరిక. తాము ఈ కోరికను నెరవేర్చి వెళ్లవలెను" అన్నాడు.

అంతట దేవతలు అందరూపోయి వసిష్ఠ మహర్షిని తీసుకొనివచ్చినారు. ఆయన విశ్వామిత్రుడితో సఖ్యపడి "బ్రహ్మదేవుడూ దేవతలూ చెప్పినట్టు నీవు బ్రహ్మర్షివేను" అన్నాడు. బ్రహ్మదేవుడు అప్పుడు మళ్ళీ "ఓవిశ్వామిత్రా నీవు బ్రహ్మర్షివి. బ్రహ్మర్షికి ఉండే అధికారాలు అన్నీ నీకు ఉంటవి" అని చెప్పినాడు.

బ్రహ్మదేవుడూ దేవతలూ వెళ్లిపోయినారు.

విశ్వామిత్రుడు వసిష్ఠ మహర్షిని పూజించి సత్కరించి వీడ్కోలు చెప్పి పంపించినాడు. అంతట ఆయన తాపసిగా ఈ భూలోకముఅంతా తిరిగి చూచినాడు.

ఈవిధముగా బ్రాహ్మణ్యము సంపాదించిన విశ్వామిత్రుడు మహర్షులు అందరిలోనూ అగ్రగణ్యుడు. ఈలోకములోతపస్సు ఈయనరూపాన వెలసింది. ఈయన పరమధార్మికుడు. మహాపరాక్రమవంతుడు" అంటూ బ్రాహ్మణోత్తముడు శతానందుడు చెప్పి ఊరకున్నాడు.

జనకమహారాజు అంతట విశ్వామిత్ర మహర్షికి సాష్టాంగ నమస్కారము చేసి "ఓ బ్రహ్మర్షీ, తాము నా యజ్ఞానికి వచ్చినందువల్ల నేను ధన్యుణ్ణిఅయినాను. మాన్యుణ్ణి అయినాను. పవిత్రుణ్ణి అయినాను. ఓస్వామీ, తాము బ్రహ్మర్షులలో ఉత్తమోత్తములు. ఓ మహాభాగా, తమసందర్శనభాగ్యమువల్ల ఇప్పుడు నాకు అనేక సద్విషయాలు తెలిసినవి. మహత్తరము అయిన తమ తపస్సును గురించిన వివరాలు అన్నీ నేనూ ఈరామలక్ష్మణులూ ఈ సదస్యులూ ఇప్పుడు వినకలిగినాము. మహానుభావా, తమ తపస్సు అప్రమేయము. తమ బలము అప్రమేయము. తమ పరాక్రమము అప్రమేయము. తమ సద్గుణాలు అప్రమేయాలు. ఓ అప్రమేయా, మహాదాశ్చర్యము కలిగించే తమ కథ ఎంతవిన్నా తనివితీరలేదు.

ఓ మహాముని. ఇప్పుడు సూర్యుడు అస్తమించబోతున్నాడు. సాయంకాలాహ్నికాలను నెరవేర్చడానికి నాకు సెలవు ఇప్పించవలెను. ఓబ్రహ్మర్షీ, రేపు ఉదయము తాను తిరిగి నాకు దర్శనము ఇప్పించవలెను. ఓ మహాత్మా తమకు ఎప్పుడూ స్వాగతమేను" అంటూ జనకమహారాజు ఉపాధ్యాయులతోనూ బంధువులతోనూ విశ్వామిత్ర మహర్షికి ప్రదక్షిణముచేసి సెలవు తీసుకొని వెళ్లిపోయినాడు.

అప్పుడు విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో తన విడిదికి పోయినాడు.

## ౬౬

తెల్లగా తెల్లవారింది. జనకమహారాజు ప్రాతఃకాలకరణీయాలను ముగించుకొని విశ్వామిత్రుణ్ణీ రామలక్ష్మణులనూ పిలిపించినాడు. శాస్త్రీయముగా విశ్వామిత్రమహర్షిని అర్చించినాడు. ఉచితరీతిని రామలక్ష్మణులను సమ్మానించినాడు.

"ఓ మహాముని, తమకు స్వాగతము. తమ అనుజ్ఞ ఏమిటి. చెప్పవలెను" అన్నాడు జనకమహారాజు.

"ఓ రాజా, ఈ రామలక్ష్మణులు దశరథమహారాజుపుత్రులు అని చెప్పినాను. ఈ వీరులు ఇద్దరూ నీ ఇంట్లోఉన్న శివధనుస్సు చూడతలచి నా వెంట వచ్చినారు. ఆ ధనుస్సు వీరికి చూపించవలెను. నీకు శుభము అవుతుంది. కృతకాములు అయి వీరు యథేష్టముగా వీరి పట్టణానికి వెళ్ళిపోతారు" అన్నాడు విశ్వామిత్రమహర్షి.

జనకమహారాజు "స్వామీ, ఆ ధనుస్సు మా ఇంట్లోకి ఎట్లా వచ్చిందీ మొదలుఅయిన విషయాలు ముందుగామనవిచేస్తాను. వినవలెను. నా పూర్వీకుడు నిమిచక్రవర్తి తరువాత ఆరోతరములో దేవరాతుడు అనే ఆయన రాజ్యము చేస్తూ ఉండేవాడు. ఆయనకు దేవతలు శివధనుస్సును నిక్షేపముగా ఇచ్చినారు.

పూర్వము శివుడు దక్షయజ్ఞాన్ని ధ్వంసము చేసే సమయములో దేవతలమీద కోపమువచ్చి ఈ వింటిని ఎక్కుపెట్టి "ఓ దేవతలారా, ఈ యజ్ఞములో నేను అడిగినప్పటికిన్నీ మీరు హవిర్భాగాలలో నాకు పాలుపెట్టలేదు. అందువల్ల ఇప్పుడు ఈ వింటితో మీ తలలు తెగవేస్తాను" అన్నాడు. అంతట దేవతలు అందరూ ఆయనను స్తోత్రముచేసినారు. ఆయన అంతట ప్రసన్నుడుఅయినాడు. ఆ ధనుస్సును దేవతలకు ఇచ్చివేసినాడు. ఆ దేవతలు ఆ శివధనుస్సును దేవరాతుడికి న్యాసముగా ఇచ్చినారు. అప్పటినుంచీ ఆ విల్లు మా ఇంట్లో ఉంది.

నేను ఒకప్పుడు యజ్ఞముచేయ తలపెట్టి భూమిని దున్నుతూ ఉండగా నాగటిచాలులోనుంచి ఒక స్త్రీ శిశువు లేచింది. ఆ శిశువు నాగటిచాలులో దొరికినందువల్ల నేను దానికి సీత అని పేరుపెట్టి నా స్వంతకూతురుగా పెంచుకొంటున్నాను. అది పెరిగి పెద్దదిఅయింది. అయోనిజ కాబట్టి దానిని వీర్యవంతుడికి ఇచ్చి పెండ్లిచేయవలెను అనుకొన్నాను. అనేకమంది రాజకుమారులు సీతను వరించినారు. ఆమె వీర్యశుల్క అని నేను వారికి చెప్పినాను. ఆ వీర్యశుల్కము ఏమిటో చెప్పమని వారు అందరూ నన్ను అడిగినారు. నేను శివధనుస్సును వారికి చూపించి దానిని ఎక్కుపెటడము అన్నాను. వారు ఆ ధనుస్సును లేవనెత్తలేకపోయినారు. దానిని అటూ ఇటూ కదిలించడము అయినా చేతకాలేదు. అందువల్ల వారి పరాక్రమము అల్పమేను అని నేను అనుకొని సీతను వారికి ఇవ్వడానికి ఒప్పుకోలేదు.

నేను వారి పరాక్రమాన్ని సంశయించినాను అనీ వారిని తిరస్కరించినాను అనీ వారికి అందరికీ నా మీద కోపము వచ్చింది. అంతట వారు అందరూ ఏకముఅయి మిథిలానగరాన్ని ముట్టడించినారు. ఆ ముట్టడి ఒక సంవత్సరము సాగింది. నా సైన్యసామగ్రి అంతా నాశనముఅయిపోయింది. అప్పుడు నేను చాలా దిగులుపడిపోయినాను. తపస్సుచేసి దేవతలను సంతోషపెట్టినాను. దేవతలు సంతుష్టులుఅయి నాకు చతురంగబలాలనూ అనుగ్రహించినారు. అంతట ఆ పాపకర్ములను ఆ అల్పవీర్యులను చెదరగొట్టినాను వారు అందరూ పలాయనముఅయినారు.

ఆ పరమభాస్వరము అయిన శివధనుస్సును ఇప్పుడు తెప్పించి ఈ రామలక్ష్మణులకు చూపిస్తాను. ఓ మహాముని, రాముడు ఆ ధనుస్సును ఎక్కుపెట్టేట్లయితే నా కూతురు సీతను ఇచ్చి పెండ్లిచేస్తాను" అన్నాడు జనకమహారాజు.

## ౬౭

జనకమహారాజు చెప్పింది అంతా విని విశ్వామిత్ర మహర్షి "ఆధనుస్సును రాముడికి ఇప్పుడే చూపించవలెను" అన్నాడు.

ఆ ధనుస్సును ఆయజ్ఞ వాటికకు పట్టుకొని రావలసింది అని జనకమహారాజు మంత్రులను ఆజ్ఞాపించినాడు. వారు అంతట మిథిలానగరములోకి పోయి ఆ ధనుస్సును దాచి ఉంచిన ఎనిమిది చక్రాల ఇనుప భోషాణాన్ని బయటికి లాగించడానికి ప్రయత్నము చేసినారు. ఒడ్డూ పొడుగూ ఉన్న బలాఢ్యులను అనేక మందిని పిలిపించినారు. వారు అందరూ ఆ మందసాన్ని ఎట్లాగో బయటికి లాగి అతికష్టము మీద అక్కడ నుంచి జనకమహారాజు దగ్గరకు తీసుకొనిపోయి "రాజులు అందరూ పూజించే దివ్య ధనుస్సును తీసుకొని వచ్చినాము" అని చెప్పినారు.

అప్పుడు జనకమహారాజు" బ్రహ్మర్షీ, మావంశీయులున్నూ ఇంకా ఇతర రాజులున్నూ ఈ ధనుస్సును పూజిస్తూ వచ్చినారు. సురాసురులు కానీ యక్షరాక్షసగరుడ గంధర్వకిన్నర మహోరగులు కానీ దీనిని ఎక్కుపెట్టలేక పోయినారు. ఈ వింటిని వంచినవారు కానీ దీనికి అల్లెత్రాడు ఎక్కించిన వారు కానీ దీనిలో బాణము కూర్చినవారు కానీ కూర్చిన బాణాన్ని వదలడానికి అల్లెత్రాటిని లాగినవారు కానీ దీనిభారాన్ని పరీక్షించినవారు కానీ ఇంతవరకూ ఎవరూ లేరు. శివదేవుడి ధనుస్సు ఇప్పుడు తమ ఎదుట ఉంది. తామే దానిని రామలక్ష్మణులకు చూపించవలెను" అన్నాడు.

విశ్వామిత్ర మహర్షి "నాయనా, రామా, ఆ విల్లు ఏమిటో చూడు" అన్నాడు.

ఆ బ్రహ్మర్షి, ఆజ్ఞను శిరసావహించి రాముడు ఆ ఇనుపమందసము మూత తెరచినాడు. గంధమాల్యాదులతో అలంకరించి ఉన్న ఆ శివధనుస్సును చూచినాడు.

"బ్రహ్మర్షీ, ఈ వింటిని నాచేతితో లేవనెత్తుతాను. దీనిభారాన్ని పరీక్షచేసి ఎక్కుపెట్టవలెను అనుకొంటున్నాను" అని విశ్వామిత్ర మహర్షితో రాముడు అన్నాడు.

"మంచిది,మంచిది" అని విశ్వామిత్ర మహర్షీ జనకమహారాజూ అన్నారు.

రాముడు ఆ వింటినడుము చేతితో పట్టుకొని అవలీలగా లేవనెత్తినాడు. ఆ యజ్ఞానికి వచ్చిన మహర్షులూ రాజరాజులు వేలకొద్దీమహాజనములూ నివ్వెరపోయినారు. రాముడు ఆ వింటికి ఇట్టే అల్లెత్రాడు ఎక్కించినాడు. అప్రయత్నముగా బాణము కూర్చినాడు. ఆబాణము వదలడానికి అల్లెత్రాటిని ఆ కర్ణాంతమూ లాగినాడు.

ఆ ధనుస్సు అంతట ఫెళ్లున విరిగిపోయింది.

పిడుగుపడ్డంత చప్పుడు అయింది. పర్వతాలు అన్నీ బ్రద్దలు అయిపోతున్నవా అనిపించింది. భూమి అంతా కంపిస్తూఉన్నట్టుగా తోచింది. అందరూ నేలమీద కూలినారు. ఆ మహాధ్వనికి విశ్వామిత్ర మహర్షీ జనకమహారాజూ రామలక్ష్మణులూ తప్ప తక్కినవారు అందరూ మూర్ఛపోయినారు. కొంత సేపటికి తెప్పరిల్లినారు.

అప్పుడు జనకమహారాజు విశ్వామిత్ర మహర్షినిచూచి "మహానుభావా, ఈజగత్తులో రాముడు ఒక్కడే వీర్యవంతుడు. ఇతడు ఈ విల్లును వంచగలడు అని నేను ఊహించలేదు. ఇంతటి శక్తిమంతుడు ఈలోకములో ఉన్నాడు అని నేను అనుకోలేదు. అంతా అత్యద్భుతముగా ఉంది. ఇక నా కూతురు సీతను రాముడికి ఇచ్చి పెండ్లి చేస్తాను. సీత నా వంశానికి కీర్తి తీసుకొని వస్తుంది.

ఓ మహర్షీ, పరాక్రమమే సీతకు ఓలి అని నేను ప్రతిజ్ఞ చేసినాను. ఇప్పుడు నా ప్రతిజ్ఞ నెరవేరింది. నాకు నా ప్రాణాలకన్నా ఎక్కువ అయింది సీత. రాముడికి ఇచ్చి పెండ్లిచేస్తాను."

"బ్రాహ్మణోత్తమా, దశరథ మహారాజు అనుమతి కోసము నా మంత్రులను అయోధ్యాపట్టణానికి ఇప్పుడే పంపిస్తాను. రామలక్ష్మణులు తమ వెంట ఇక్కడికి రావడమూ శివధనుస్సును రాముడు విరిచివేయడమూ నేను సీతను రాముడికి ఇచ్చి వివాహము చేయ నిశ్చయించటమూ మొదలుఅయిన వృత్తాంతము అంతా నా మంత్రులు దశరథమహారాజుకు విన్నవించి ఆయనను సంతోషపెట్టి సపరివారముగా ఇక్కడకు తోడ్కొని వచ్చేట్టు చేస్తాను. ఇందుకు తాము అనుమతించవలెను." అన్నాడు జనక మహారాజు.

"అట్లాగే చేయవలెను" అని విశ్వామిత్ర మహర్షి అన్నాడు.

అంతట జనకమహారాజుమంత్రులు అయోధ్యాపట్టణానికి ప్రయాణము అయినారు.

## ౬౮

జనకమహారాజు మంత్రులు గుర్రాలు అలసిపోయేటట్టుగా మూడు అహోరాత్రములు ప్రయాణముచేసి నాల్గవనాడు ఉదయము అయోధ్యానగరము చేరినారు. రాజభవనము దగ్గరకుపోయి ద్వారపాలకులను చూచి తమ రాక దశరథ మహారాజుకు విన్నవించమన్నారు.

జనకమహారాజు మంత్రులు రాజానుమతితో రాజగృహములోకి పోయి

వారు. వృద్ధుడు అయినప్పటికిన్నీ దేవతుల్యుడుగా తేజరిల్లుతూ ఉన్న దశరథ మహారాజును చూచినారు. ఆయన ప్రసన్నవదనము చూడగానే వారికి బెరుకూ [?] లేకుండాపోయింది. వినమ్రహృదయాలతో నమస్కారముచేసి "మహారాజా, మేము మిథిలాధిపతి జనకమహారాజు దూతలము. మా మహారాజు స్నేహపూర్వకముగా తమ కుశలమూ తమ ఉపాధ్యాయుల కుశలమూ అడిగి తెలుసుకోమన్నారు. ఇంకా తమ అగ్నిహోత్రాదులు నిరంతరాయముగా సాగుతూ ఉన్న విషయమూ తెలుసుకోమన్నారు" అని చెప్పినారు.

కుశలప్రశ్నలు అయిపోయిన తరువాత జనకమహారాజు మంత్రులు మళ్ళీ "ఓ రాజా, తమకు మేము ఒక విషయము విన్నవించడానికి విశ్వామిత్ర మహర్షి అనుమతితోనూ శతానందోపాధ్యాయులవారి సమ్మతితోనూ మా మహారాజు మమ్ములను తమవద్దకు పంపించినాడు.

మా మహారాజు తన కూతురు సీతాదేవికి పరాక్రమమే ఓలి అని ప్రతిజ్ఞ చేయడమూ అనేకమంది రాజకుమారులు వచ్చి నిర్వీర్యులు అయి విఫలులు అయిపోవటమూ తమకు తెలిసిన విషయమే అయి ఉండవచ్చును. తమ పుత్రులు రామలక్ష్మణులు విశ్వామిత్ర మహర్షి వెంట దైవికముగా మా రాజధాని నగరానికి మా మహారాజు చేస్తూ ఉన్న యజ్ఞము చూడవచ్చినారు. తమ పెద్ద కుమారుడు రాముడు మహావీరుడు. సీతాదేవికి వీర్యశుల్కము ఇచ్చినాడు.

ఓ రాజా, మహర్షులూ రాజర్షులూ రాజరాజులూ చూస్తూ ఉండగా మహాపరాక్రమవంతుడు రాముడు శివధనుస్సు మధ్యభాగము పట్టుకొని లేవనెత్తి ఎక్కుపెట్టినాడు. అది అంతట విరిగి పోయింది. సీతాదేవికి పరాక్రమమే ఓలి అయినందువల్ల రాముడికి సీతాదేవిని ఇచ్చి పెండ్లి చేయడానికి మా మహారాజు నిశ్చయించినాడు. అందుకు తామున్నూ అనుమతించి తమ ఉపాధ్యాయులతోనూ పురోహితులతోనూ బంధుమిత్రులతోనూ సపరివారముగా మా మిథిలానగరానికి రావలెను, రాజా, తమ దర్శనము చేసి మా మహారాజు తన కూతురు సీతాదేవి వివాహము చేయతలచినాడు. తమకు ఈ విషయము మనవి చేయడానికి మమ్ములను మా జనక మహారాజు పంపించినాడు." అని చెప్పి ఊరకున్నారు.

దశరథమహారాజు చాలా సంతోషించినాడు. ఆలోచించినాడు. మనసా నిశ్చయించుకొన్నాడు. అంతట వసిష్ఠమహర్షినీ వామదేవుణ్ణీ చూచి "బ్రాహ్మణోత్తములారా, ఈ దూతలు చెప్పింది మీకు ఇష్టము అయినట్లయితే మనము అందరమూ మిథిలానగరానికి తరలిపోదాము. ఆలస్యము వద్దు." అన్నాడు.

మహర్షులూ మంత్రులూ ఆలోచించి "బాగుంది" అని చెప్పినారు.

అంతట దశరథమహారాజు మరునాడే ప్రయాణము అన్నాడు.

జనకమహారాజు మంత్రులను అందరినీ దశరథమహారాజు చక్కగా సత్కరించినాడు. వారు ఆరాత్రి సంతోషముగా అక్కడ ఉండిపోయినారు.

తెల్లవారగానే దశరథమహారాజు ఋత్విజులూ బంధువులూ మంత్రులూ మొదలుఅయినవారిని అందరినీ పిలిపించినాడు.

సుమంత్రుణ్ణి చూచి సంతోషముతో "మంత్రిసత్తమా, జనకమహారాజు దూతలు నన్ను తొందరపెట్టుతున్నారు. ప్రయాణసన్నాహము అంతా నీవు చేయవలెను. ముందుగా ధనాధ్యక్షులు నానావిధ రత్నాలనూ పుష్కలముగా ధనాన్నీ తీసుకొని సురక్షితముగా ప్రయాణము అయిపోవలెను.

ఆతరువాత మనము అందరమూ తరలిపోయే ఏర్పాటు చేయవలెను" అని చెప్పినాడు.

వసిష్ఠమహర్షి వామదేవుడూ జాబాలీ దీర్ఘాయుష్మంతుడు అయిన మార్కండేయుడూ కాత్యాయనుడూ ఇంకా తక్కిన బ్రాహ్మణోత్తములూ ముందు బయలుదేరినారు. వారి వెనుక రథముమీద దశరథమహారాజూ ఆయా వాహనాలతో ఆయన పరివారమూ చతురంగసేనలూ నడిచినవి.

వారు అందరూ నాలుగు పగళ్లు ప్రయాణముచేసి విదేహరాజ్యము చేరినారు.

దశరథమహారాజు వస్తూ ఉన్నాడు అని జనకమహారాజుకు వర్తమానము వచ్చింది. ఆయనను సత్కరించి తీసుకొనిపోవడానికి ఎదురుకుండా జనకమహారాజు వచ్చినాడు. దశరథ మహారాజును పరివారసహితముగా చూచి సంతోషించినాడు. వారిని వెంటపెట్టుకొని తన యజ్ఞవాటికకు పోయినాడు. వారిని అందరినీ యథోచితముగా సత్కరించినాడు.

దశరథమహారాజు కూర్చున్న తరువాత "ఓ రాజా, స్వాగతము. నా భాగ్యవశమువల్ల తాము ఇక్కడికి వచ్చినారు. తమ పుత్రుని పరాక్రమ విజయానికి తాము మనసారా సంతోషించవలెను. వసిష్ఠమహర్షి ఇంతమంది బ్రాహ్మణులను వెంటపెట్టుకొని తమతో రావడము నా పూర్వపుణ్యము."

"రాజా, మహాపరాక్రమవంతులు పుట్టిన రఘువంశమువారితో ఇప్పుడు వియ్యము అందబోతున్నాను. ఇప్పుడు నా వంశము మరింత పూజనీయము కాబోతున్నది. ఇది అంతా నా పుణ్యపరిపాకము అనుకొంటున్నాను."

"రాజా, రేపటితో నా యజ్ఞము సమాప్తము అయిపోతుంది. అంతట మహర్షుల సమ్మతితో సీతారాముల వివాహము చేయతలచినాను" అన్నాడు.

దశరథ మహారాజు చిరునవ్వుతో "రాజా తాము దాతలు. దానము దాతవశము అని పెద్దలు చెప్పగా విన్నాను. అందువల్ల తాము ఎప్పుడు ఏది ఇస్తాము అంటే అప్పుడు అది పుచ్చుకోడమే మా పని" అన్నాడు.

దశరథ మహారాజు ఇంత చక్కగా అన్నందుకు జనకమహారాజు ఉబ్బిపోయినాడు.

పెండ్లికి వచ్చిన మహర్షులు అందరూ ఆరాత్రి అక్కడ సుఖముగా గడిపినారు.

దశరథమహారాజు పుత్రులతో ముచ్చటలు ఆడుతూ ఆరాత్రి పొద్దుపుచ్చినాడు.

జనకమహారాజు వివాహ ప్రయత్నములో నిమగ్నుడు అయినాడు.



# దుఃఖ పరిశీలన

రచన: "హసజ"

యుద్ధాలు, విప్లవాలు, సంస్కరణలు జయాప్రద మౌతాయి. పరాజితులు ఓటమితో కుంగిపోతారు. విజేతలు విజయోత్సాహంతో వివశులవుతారు, తాత్కాలికమైన ఆ ఉద్రేక పారవశ్యంలో దుఃఖం తొలగిపోయిందని, మనుష్యుడికి విముక్తి లభించిందని కవులు గీతాలు వ్రాస్తారు. గాయకులు పాడుతారు. అమాయకులు ఆనందిస్తారు.

ఆ ప్రమోద ఉద్రేకం, ఆనందం త్వరలోనే ఉడిగిపోతాయి. మళ్ళీ వ్యక్తిని దుఃఖం వెంటాడుతూనే ఉంది. ఉంటుంది. ఇంతకాలంకూడా, ఈ విజయోత్సాహపరంపరల్లోకూడా ఈ అనాది దుఃఖం నిప్పులా రాజుతూనే ఉంటుంది. కాని బైటినుంచివచ్చిన పొగల్లో ఉమంట [?] తాత్కాలికంగా కనపడదు. మళ్లీ ఆ పొగలు చెదరగానే దుఃఖపు నాల్కలు నిప్పుగక్కుతూనే వుంటుంది.

ఎట్టి సాముహిక, సామాజిక ఉద్యమాలుకూడా వైయక్తిక దుఃఖాన్ని (దుఃఖం ఎప్పుడూ వైయక్తికమే) ఏవిధానం ద్వారానూ ఉపశమింపజేయలేకుండా ఉన్నయ్. మత,ఆర్థిక, రాజకీయ ఉద్యమాలేకూడా ఆశపెట్టటమే తప్ప, మనుష్యుని దుఃఖాన్ని తొలగించలేకుండా ఉన్నవి.

అనుభవం ఇలా ఉన్నా, మనిషి దుఃఖానికి మూలమయిన తననుంచి దూరమయి, దుఃఖానికి ప్రతిబింబమై, ప్రతిఫలనమయిన బాహ్య, సాముహిక కృషిలోనే నిమగ్నమవుతూ ఉంటాడు. అందుకనే అతను ఏకాంతాన్ని భరించలేడు. ఎప్పుడూ మరింకెవరినో అంటిపెట్టుకొని ఉంటాడు. ఒకఉద్యమంలో లీనమవుతూ ఉంటాడు. నిరంతరం ఊపిరి సల్పని ఆలోచనావ్యూహంలోనో, కార్యవేగంలోనో చిక్కుకుపోతాడు. "వ్యవధి ఎక్కడుంది?" అంటాడు - వ్యవధిలేని బతుకును తానే కల్పించుకొని.

సాముహికస్థాయిలో పనిచేసే వ్యక్తులు, పార్టీలు వ్యక్తులతో ప్రసక్తిపెట్టుకోరు. ఒక సిద్ధాంతాన్ని తీర్మానిస్తారు. ఒక కార్యక్రమాన్ని ఏర్పరుస్తారు. ఆరీతిని మిగతావారు అనుసరించాలి. అంటే బైటనుంచి నడిపే ఏ ప్రత్యేక కార్యవిధానంవల్లనో వైయక్తిక సంక్షోభను మార్చివేయగలం అనుకుంటారు

మానవ సంక్షోభ తుఫానుల్లా, వరదల్లా, భూకంపాల్లా బైటనుంచి వచ్చేదికాదు. మానవ సంక్షోభ మానవుడి నుంచె ఉత్పన్నమవతోంది. భూమి, గాలి, నీరు, బంగారపు గనులు, బొగ్గు గనులు, ఎడారులు, నదులు ఇవి మనకు సంక్షోభ కల్గించలేదు. వీటికి సంబంధించిన ఉత్పత్తి, వినియోగ శాస్త్రాల్లో ఎంత మహత్తర పరిశోధనలు జరిగినా ఎన్ని కొత్తసంగతులు కనిపెట్టబడినా, వాటివల్ల మానవ సంక్షోభ తొలగిపోవటం అనేది భ్రమ. కాబట్టి మతాలను, రాజకీయాలను, ఆర్థిక సిద్ధాంతాలను వదిలేసి, యావత్తు ఆశను 'సైన్సు' అభివృద్ధిపై పెట్టుకొన్నవారికి భంగపాటు తప్పదు. మతాలు, రాజకీయాలు ఇత్యాదులతో పాటు 'సైన్సు' కూడా ఇంకొక్కవ సంక్షోభకి కారణం అవుతుంది. అవుతోంది. మతాలను, రాజకీయాలను వెక్కిరించటం అలవాటైన 'సైన్సు' అభిమానులు 'సైన్సు'కూడా మనుష్యుడి అధిక్షేపణకు గురికావటం గమనించి, వాపోతారు.

దైవనిగ్రహం, రాజకీయ పార్టీ, ఆర్థిక వ్యవస్థ, విజ్ఞానపీఠం......ఇవన్నీ రకరకాల ప్రతిమలు, ఇందులో ఏ ప్రతిమకూడా మానవ దుఃఖాన్ని తొలగించలేదు. దుఃఖఫలితాలు దుఃఖాన్ని తొలగించలేవు. ఈ ప్రతిమలన్నీ మనుష్యుని మనస్సుతీర్చి, దిద్దినవే. మనస్సును ప్రతిబింబమే ఏ ప్రతిమ అయినా, ఉద్యమమైనా, నీడ మూలాన్ని మార్చలేదు. మనుష్యుడు నీడ వెంటబడి తిరుగుతున్నాడు. కాబట్టే అతను చీకటిలోనుంచి చీకటిలోకే ప్రయాణంచేస్తూన్నాడు.

పురుషుడు, స్త్రీ, కామం, సంతానం, కుటుంబం, కులం, సమాజం, ప్రాంతం, దేశం ఇవన్నీ నీడలు. ఈ నీడలు భయంకరంగా, దుఃఖప్రదంగా ఉన్నాయని, వీటి సంబంధాల బాహ్యరూపాలను అనేక విధాలుగా మారుస్తున్నారు—ఎప్పటికప్పుడు. కాని మార్పులు చేసినప్పటికీ, మళ్ళీ ఎలాగో ఎక్కడినుంచో, కట్టుదిట్టం చేయబడిన ఈ నీడల్లోంచి దుఃఖవాహినులు పొంగుతూ ప్రవహిస్తూనే ఉన్నాయ్. మార్పులు చెయ్యకుండాఉన్నా, దుఃఖం ఇంకిపోవటం లేదు. ప్రపంచపటం కనిపిస్తే, వివిధసమాజాలు వివిధ రీతులను అవలంబిస్తున్నా, ఐక్యలక్ష్యాన్ని చేరుతున్నయ్. అవి ఏకైకలక్ష్యం దుఃఖం.

ఏ ఒక్కచోటకూడా దుఃఖం ఎలుగెత్తని సమాజంలేదు. దుఃఖం ఎలుగెత్తని ఏ ఒక్క మతమూలేదు. రాజకీయ నిర్మాణమూలేదు. ఆర్థికవ్యవస్థా లేదు. సుఖాన్వేషణలో ఒక అభిప్రాయంనుంచి మరొక అభిప్రాయానికి మజిలీచేయటమేతప్ప, మనుష్యుడు సాధించగలుగుతోంది ఏమీలేదు.

సుఖదుఃఖాలమధ్య మనుష్యుడుపడుతున్న పోట్లాటాపే దరిద్ర. నాగరికత. అతని నిరంతర భ్రాంతికి ప్రతిబింబాలే మతాలు, రాజకీయాలు, ఇత్యాదులు.

## 2

ప్రపంచ సారస్యం పెద్దలచేతుల్లోనే ఉన్నా, ఏలాను పరిశీలిస్తే, పెద్దల వైఫల్యానికి కారణాలు గోచరించగలవు. పిల్లవాడికి వస్తువులను తాకటం, పట్టటం చేతవటం ఆరంభమైనప్పటి నుంచి, వాడి ఆరాటం ఒక్క ఆట వస్తువులపైకే కాదు, కనపడే ప్రతిదాని పైకీ ప్రసరిస్తుంది. నిప్పుపై చెయ్యి వేస్తాడు. అంటే వస్తుజ్ఞానంలేక బాధపడుతాడు. తనకు బైటవస్తువులకు ఉన్న సంబంధాన్ని తెలుసుకోలేక బాధపడుతాడు. పెద్దలదశల్లోకూడా ఇది ఎప్పుడూ కనపడుతూనే ఉంటుంది.

పిల్లవాడిచేతిలో వస్తువు తీసివెయ్యి-వాడి దుఃఖం అపారం. తెస్తానని, ఏడిన్నా కేవలంటులు [?]. వాడి విచారం అగాధం మరేవస్తువిచ్చినా వాడి విషాదం తగ్గదు. వాడికి సంతోషం కల్గదు. అంటే వాడు వాంఛబంధితుడు. జీవితం యావత్తూ అవాంఛే అని వాడి నమ్మకం. ఆ వాంఛ భగ్నంకాగానే, వాడి జీవితం విచ్ఛిన్నంఅయిపోయినట్టుంటుంది. పెద్దల చర్యల్లో కూడా ఇది కనపడుతూనే ఉంటుంది. కాలవాటే [?] వయస్సుమట్టి, మనఃపరిణామంబట్టి వాంఛలస్థాయి మారుతూ వుంటుంది. అలాగే వాటి భంగపాటు ఫలితంగా దుఃఖ స్వరూపమూ మారుతూంది.

అయితే పిల్లవాడికి ఆత్మ-జ్ఞానం ఉండదు. అది వాడి ప్రయత్నానికి అసాధ్యం. కేవలం మనస్సుకు వాడు కీలుబొమ్మ. పెద్దలకు ఆత్మజ్ఞానం వయస్సుతో దానంతట అదే వచ్చేస్తుందని కాదు. కాని ప్రయత్నానికి అర్హులు. అయినా పెద్దలూ కేవలం మనస్సుకు కీలుబొమ్మలుగానే ఉంటారు. అంటే భుజబలం, ధనబలం, పాండిత్యబలం ఇవన్నీ ఉన్నా, మనుష్యుడు ఆత్మజ్ఞానరహితుడై, కేవలం మనస్సుకు బానిస అయే ఉంటున్నాడు. కాబట్టే వీరులూ, సంపన్నులూ, పండితులూ దుఃఖాన్ని తొలగించలేక పోయారు.

ఆత్మజ్ఞానం ఉండనప్పుడు పరజ్ఞానం అసాధ్యం. ఇక తనకు జగత్తుకు మధ్యనున్న సంబంధం గురించిన జ్ఞానం అసలే శూన్యం. కాబట్టే మనుష్యుడు తనలో తాను కల్లోలానికి గురవుతున్నాడు. ఇతరుల సంబంధాల్లోనూ కల్లోలానికి గురవుతున్నాడు. ఆత్మజ్ఞానం శూన్యమైయుండటంవల్లనే, సంబంధాల్లో ఎన్నిమార్పులు చేసుకుంటున్నా మనుష్యుడికి దుఃఖం తప్పటంలేదు. ఆత్మ-జ్ఞానంలేనిచోట కల్లోలమూ, అయోమయమూ, దుఃఖమూ కాక, ఆనందం ఎలా ఆవిష్కృతం అవుతుంది? ఆత్మజ్ఞాన శూన్యస్థితి మహాభయంకర చ్ఛాయ ఇప్పుడు విశ్వమంతా అలముకొని ఉన్నది. ఆత్మజ్ఞానం లేకపోవటమే దుఃఖం.

## 3

తనకు, ఇతర జీవరాశికి మధ్యనున్న సంబంధంలోంచే మనుష్యునికి కామం, కుటుంబం, సమాజం, రాజకీయాలు, మతాలు ఉద్భవిస్తున్నయ్. శాంతిగానీ, దుఃఖంగానీ ఈ సంబంధంలోంచి జనిస్తోంది. యీ సంబంధపు స్వభావంలోనే బద్ధమైయుంది దుఃఖం. యీ స్వభావాన్ని మనస్సు నిర్దేశిస్తుంది. అంటే దుఃఖానికి మూకటి వేరు మనస్సు.

దుఃఖాన్ని అర్థం చేసుకోవాలంటే, అన్ని అభిప్రాయాలు, సంబంధాలు, మతాలు, రాజకీయాలు వగైరాలను విడనాడి మనస్సులోకి ప్రయాణం చేయాలి. నదులకు, సముద్రాలకు, సంధులకు యాత్రలకు విశ్వమంతా సంచరించి, దుఃఖాన్ని నివారించుకోలేము. యీ యాత్రలన్నీ కూడా, దుఃఖ నిర్మూలన యాత్రలన్నీకూడా దుఃఖబద్ధమైనవే. అలాగే తీర్థయాత్రలూ, ఇత్యాదులూ. యీ యావత్తూ మనఃకల్పితమే. అంటే దుఃఖ నిర్మూలనకై మనం పడేపాట్లలోకూడా దుఃఖం ఇమిడేఉంది. నిప్పును నిప్పు చల్లార్చదు. అందుకనే ఒక దుఃఖంనుంచి మరొక దుఃఖానికి ప్రయాణం చేస్తున్నాం. ఇది సువిదితం.

దుఃఖం, సుఖం ఇవన్నీ వాటంతట అవి ఉనికిఉన్నవి కావు. అంటే ఎవరేమి చేసినా, అందులో నిమిత్తం లేకుండా ఇవి దాపరించేవికావు. ప్రకృతిలోని వివిధ ఋతువులవలె, ఇవి మనుష్యుడి జీవితంలో ఒక రీతిని పరిభ్రమిస్తూ ఉండవు. దుఃఖ సుఖాలు, నిరాశ ఆశలు మనుష్యుడు తోటివారితో పెట్టుకొనే సంబంధంలోనే పుట్టుతున్నయ్. ఆ సంబంధాన్ని కల్పించేది మనస్సు. ఆకల్పనలోనే దుఃఖపు విత్తును మనస్సు నాటుతుంది క్రమేపీ ఆ విత్తు పెట్టయి, దాని శాఖోపశాఖలు అంతటా వ్యాపిస్తయ్.

మానసిక చైతన్యంలేని జీవరాశికి దుఃఖంలేదు. దుఃఖపు స్పృహలేదు. వాటికి అనుభవజ్ఞానం శూన్యం.

మానసిక చైతన్యానికి ఖైదీఅయిన మనుష్యుడు తన అనుభవాలను తనకు కారాగృహాలుగా చేసుకుంటాడు. ఏ దుర్విధి తనను సంకెళ్ళు బిగించి, ఓడించిందని విలపిస్తాడు. కాని ఆ సంకెళ్లు తనకుతానే బిగించుకుంటాడు. ఆ దుర్విధినీ తనకుతానే సృష్టించుకుంటాడు. ఆ కోటలోంచి బైటపడేయమని తనప్రార్థనలు జరిపే దైవాన్నీ తనకుతానే సృష్టించుకుంటాడు. ఈ అనుభవ శృంఖలాలు, దుస్థితి, దైవం ఇవన్నీ మనుష్యుడితో నిమిత్తం లేకుండా స్వయంగా ఉనికి ఉన్నవి కావు. ఇవన్నీ మనుష్యుడు కల్పించుకున్నవే. ఇవన్నీ వాటికి, ప్రపంచానికి మధ్యనున్న సంబంధ బాంధవ్యాలలోంచి పుట్టేవే. మనఃకల్పితమైన అనుభవం ఎలా దుఃఖానికి దారితీసిందో, అలాగే మనఃకల్పితమైన పలాయన మార్గాలు, దైవాలు, దయ్యాలు, దుఃఖానికి దారి తీసేయ్.

అందుకే మానవుడు దుఃఖాన్ని చల్లార్చగలిగిన జీవుడెవ్వడూ ఇంతవరకూ ముందుకు రాలేదు.

మనుష్యుడు తన అల్పశక్తిచే వంచితుడై, తన స్వార్థపు స్పృహకి దైవ సహాయాన్ని కోరుతాడు. దుఃఖానికి మూలమైన స్వార్థపు స్పృహకి సాఫల్యత చేకూరినకొద్దీ, దుఃఖం అధికతరమవుతూ ఉంటుంది. మనకు మనమై సృష్టించే శృంఖలలు మనమడిగిన వరాలు తీర్చకుండా ఎలా ఉండగలరు?

## 4

మనుష్యుడికన్ను జగత్తును చూస్తుంది. చేయి తాకుతుంది. అలా కేవలం దృష్టి పరిమితుడై, స్పర్శ పరిమితుడై ఉండడు మనిషి. వాస్తవ జగత్తును కేవలం దృశ్య జగత్తుగా, జ్ఞాన జగత్తుగా అవలోకించడు. ఈ ఇంద్రియ స్పందంలోంచి తన భిన్నత్వాన్ని కల్పించుకుంటాడు. 'తను' అనే స్పృహను కల్గించుకుంటాడు. 'నేను' అనే స్పృహలోపాటే, 'అది' అనే స్పృహకూడా కలిగి తీరుతుంది. అంటే ద్వంద్వానికి ద్వారాలు తెరుస్తాడు. ఇక ఈ 'తను' అనే స్పృహకు, 'అది' అనే జగత్తు స్పృహకు మధ్య బాంధవ్యాన్ని ఏర్పరచి, నిలబెట్టుకోటమే మనుష్యుడికి జీవితం అవుతోంది. ఈ బాంధవ్యంద్వారా 'తను' అనేస్పృహ తన కేంద్రాన్ని, మనస్సును దాటక్రమేపీ 'అది' అనే జగత్తు స్పృహపై ప్రసరించాలి. తన పాదచిహ్నాలు ఎల్లడా లోతుగా పడాలి.

ఈ భిన్నత్వపు స్పృహలోంచే, అవతలవస్తువుపై వాంఛ జనిస్తుంది. నాకు భిన్నంగా ఉన్న ఉనికి నాకు గిట్టదు. ఆ ఉనికిని నాపరం చేసుకోవాలి. ఇంద్రియాలకు అనుభవసాధ్యమయిన యావత్తూ 'నేను' అనే స్పృహలో లీనమయి పోవాలి. ఇంద్రియాలకు సాధ్యంకాని సందర్భాల్లో మంత్రతంత్రాల ప్రయోగానికి ప్రయత్నాలు జరుగుతయ్. సామ్రాజ్య లిప్సకి నిజమయిన తల్లివేరు ఈ ఆరాటమే

'నేను' 'అది' అను విభిన్న స్పృహలున్నంతవరకు, తత్సంబంధం సంఘర్షణ-యుతమయే ఉంటుంది. 'అది' అనేది కేవలం ఒక కొయ్యబొమ్మకాదు. సజీవప్రాణి. ఏ సజీవప్రాణి బుద్ధిపూర్వకంగా తన్ను మింగినచే సంబంధానికి లొంగదు. ఏదో స్థాయిలో ఏదో విధంగా ఘర్షణ తప్పదు.

ఈ స్వార్థ విస్తరణ స్పృహను స్థిరంగా వ్యక్తంచేసుకొని, ప్రపంచంలో వ్యాపింపజేసుకోవటం కోసమే, మనుష్యుడు పెళ్లిచేసుకుంటాడు. సంతానాన్ని కంటాడు. ఐశ్వర్యానికై అర్రులు చాస్తాడు. దారిద్ర్యాన్ని సృష్టిస్తాడు. ఆస్తిపాస్తులు సంపాదిస్తాడు. భూమికి సరిహద్దులు గీస్తాడు. దేశభావాన్ని ప్రేరేపిస్తాడు. యుద్ధాన్ని రగిలిస్తాడు. శాంతిని కోరుతాడు.

భార్యను ప్రేమిస్తున్నానంటాడు. సంతానంపై వాత్సల్యంఉందంటాడు. స్నేహితులకు హృదయాన్ని స్వాధీనపరుస్తానంటాడు. దేశాన్ని ధనికంచేస్తానంటాడు. ఈ వివిధవేషాలన్నిటివెనక ఉన్నది ఒక్కటే నిజరూపం అది 'నేను' అనే అహంకార స్పృహ. దాని విస్తరణ వాంఛకే ఇన్ని వేషాలు. ఇతరులపై స్వారీ చేయటానికి, వివాహాన్ని, సంతానాన్ని, సంఘాన్ని ఇత్యాది వ్యవస్థలను మనిషి నెలకొల్పాడు. ఈ వ్యవస్థలన్నీ అతని అహంకారస్పృహకు ప్రతిబింబాలే. ఈ వ్యవస్థలన్నిటిద్వారా మనిషి ఇతర జీవరాశిని మచ్చిక చేసుకొని, తనస్పృహకు వశంచేసుకోటానికి ప్రయత్నిస్తూ ఉంటాడు.

అందుకే మనుష్యుడి కన్ను ఎక్కడపడితే అక్కడ క్షోభ చెలరేగుతోంది. అతని చెయ్యి తాకినచోట ఘర్షణలు భగ్గుమంటున్నయ్.

ఈ కోటానుకోట్ల ప్రజల అహంకారస్పృహలు. ఘర్షణల అఘాతంలో గాయపడి, దుఃఖం స్రవించటంలో ఆశ్చర్యం ఏముంది?

ఆ ఘర్షణల తీవ్రత్వాన్ని తగ్గించటంవలన [?], రాజులు చేసుకొన్న సంధుల వలన ప్రయోజనం ఏమిటి? అహంకారాలమధ్య సంధి ఒడంబడికలు శాశ్వతంగా శాంతిని ఎలా నెలకొల్పగలవ్?

మన సామాజిక, ఆంతర్జాతీయ వ్యవస్థలన్నీ ఈ అహంకారాలమధ్య రాజీలకే ప్రతిబింబాలు. వివిధ అహంకారాల సమ్మేళనమే, సమన్వయమే సమాజం అంటారు. కాని సమన్వయమనేది అసంభవంకాదూ? రెండు అహంకారాలను సమన్వయపరచటమనేది పరస్పర విరుద్ధంకాదూ? అందువల్ల ఈ సమన్వయ సంస్థలన్నీ కేవలం దగా తెరలైనవే [?]. సమాజంలోని ప్రతి వ్యవస్థ ఒక కురుక్షేత్రం.

## 5

అహంకారం నెగ్గినప్పుడు, జీవి ఆ అనుభవం సుఖంగా ఎంచుతాడు. అహంకారం దెబ్బతిన్నప్పుడు దుఃఖంగా ఎంచుతాడు. కోటి సుఖదుఃఖాలు ఏ ప్రసన్నదైవమో, ఏ క్రూరగ్రహమో ఇచ్చేవికావు అవి అహంకార జనితాలు. అహంకారం నెగ్గినప్పుడుకలిగే సుఖంకూడా పూర్ణసుఖం కాదు. నిరంతర భయసంఘర్షణలతో, ప్రచ్ఛన్న దుఃఖంతో కలుషితమైన సుఖం. సుఖమనేది అసలుఉంటే, దాన్ని వెన్నంటుతూనే ఉంటుంది—దుఃఖంనీడలా. అనుక్షణం [?] సుఖాన్వేషణ ఉండేది. కాబట్టి కేవలం స్వార్థవిజయం లభిస్తూ ఉన్నాకూడా దుఃఖం తప్పదు.

అహంకారపు స్పృహలోనే ఉంది మహాశూన్యం. ఆ శూన్యాన్ని భర్తీచేసుకోవటానికి పెళ్ళాం బిడ్డలను, ఆస్తిపాస్తులను, పాండిత్య జ్ఞానాలను తనలోకి చేరదీసుకుంటూ ఉంటాడు. ఇలా సజీవులతో, నిర్జీవులతో పూడ్చినకొద్దీ, ఆ శూన్యపులోతు ఇంకెక్కువ అవుతూ వుంటుంది.

అహంకారపు స్పృహ ఉన్నంతవరకు ఘర్షణ తప్పదు. దుఃఖం తప్పదు 'నేను' 'నువ్వు' 'అది' అను స్పృహ, విభిన్న స్పృహే దుఃఖానికి కుదురు. దుఃఖం తొలగాలంటే, సుఖంకోసం ప్రయత్నించి లాభంలేదు. సుఖమనేది మిథ్య. సుఖమనేది లక్ష్యం. అననుభూతం. అయథార్థం. దుఃఖం ప్రస్తుతం. అనుభూతం. వాస్తవం. దాన్ని అర్థంచేసుకొని, దానికారణాలను తొలగించుకోవటమే దుఃఖ నిర్మూలనకు దారి. అహంకార స్పృహనుంచి విడుదల పొందటమే దుఃఖానికి నిర్మూలనం. అంతేకాని చక్కని మాటలతో ప్రొద్దుపుచ్చి లాభంలేదు. సౌభ్రాతృత్వం, సర్వసమానత్వం, దయ, ప్రేమ, సహకారం ఇవన్నీ యథార్థానికి దూరాలు. వీటికి, అహంకార ప్రవృత్తికి పొత్తులేదు. యివి, అహంకారం పరస్పర విరుద్ధాలు. అహంకారపు స్పృహ యథార్థమైనది. దానినుంచి విముక్తిపొందటమే జీవితం. మనమన అహంకారాలను దినదినం వృద్ధిచేసుకొంటూ, సౌభ్రాతృత్వం అని కరస్పర్శచేసి, ప్రేమ అని ముద్దిడి లాభమేమిటి? దీపంలోంచి వెలుతురువలె, నిరహంకారంలోంచి సౌభ్రాతృత్వం ఇత్యాదులన్నీ ప్రసరిస్తయ్.

## 6

అహంకారం జన్మతో ఆరంభమై, మృత్యువుతో విపరీతంగా పెనగులాడుతుంది. అహంకారానికి వాటిల్లే అన్ని అపజయాల్లోకీ, మృత్యువు అనతిక్రమ్యం. ఘోరం. కాబట్టే జననం అంటే విపరీత ఉల్లాసం. మృత్యువు అంటే అనంత దుఃఖం.

మరణశయ్య అహంకారానికి అర్థం. మృత్యు పాదంకింద అది చుట్టలు చుట్టుకొని, తనను తాకాటు వేసుకుంటూ, దుర్భర, విషాదయాతన పడుతూ ఉంటుంది.

సుఖదుఃఖాలవలె మారువేషాలైన ఈ జనన మరణాలు అహంకార జనితాలు.

వైయక్తికంగా, సాంసారికంగా, సామాజికంగా, లౌకికంగా అనుభవించే దుఃఖమంతా అహంకార జనితమే. దుఃఖం తొలగాలంటే, అహంకారపు స్పృహపోవాలి అహంకారం వ్యక్తిగతం. అహంకారపు స్పృహపోవాలంటే, వైయక్తికంగా సమూలమైన పరిణామం రావాలి. ఇదే దుఃఖానికి నిజమైన తొలగింపుకు సాధన.

వైయక్తికంకాని దర్శనం వైయక్తికమైన దుఃఖాన్ని ఎలా తొలగిస్తుంది?

నాదుఃఖం నావల్లకలిగింది. దాన్ని నేనే అదృశ్యం చేసుకోవాలి. సిద్ధాంతాలు, మతాలు, మంత్రాలు ఎలా నా దుఃఖాన్ని తొలగించగలవు? నా దుఃఖాన్ని కల్గించినవి అవికావు.

దుఃఖపీడితుడు మరొకని వెంటబడి లాభంలేదు. తన శూన్యాన్ని కప్పిపుచ్చుకోవటానికి, వివాహమాడి, సంతానాన్ని కని ప్రయోజనంలేదు. ఆస్తిపాస్తులు కలవచ్చేది [?] లేదు. ఈ యావత్తూ దుఃఖాన్ని కేవలం అధికంచేస్తుంది. ఎందుకంటే ఈ సంబంధాలన్నీ అహంకార బంధితాలు. అహంకారం దుఃఖ బంధితం. దుఃఖం తరించదు.

ఒకడు ఒకామెను ప్రేమిస్తాడు. వివాహంకాదు. దుఃఖిస్తాడు. తల్లి బిడ్డను కంటుంది. బిడ్డ జీవించదు. దుఃఖిస్తుంది. ఆస్తికై ఆరాట పడతారు. దక్కదు. దుఃఖిస్తారు.

దుఃఖితుడు తాను అమాయకుడని, ఏ పాడువిధో తన్ను ఏడిపిస్తోందనీ అనుకుంటాడు ఎప్పుడూ. సుఖ దుఃఖాలు పరాధీనాలని మిథ్యపరచుకుంటాడు. కాని ఈ వియోగ, వస్తు దుఃఖాలన్నిటి వెనుక నిలబడి, కళ్ళను అశ్రుపూర్ణాలను చేస్తోంది. తానే. తన అహంకార స్పృహ!

తన్ను తాను తెలుసుకోవటానికి పూనుకుంటే గదా, తను జగత్తులో ఎట్టి సంబంధం పెట్టుకోవాలో తెలుసుకోగలిగేది. తను గుడ్డిగా సంచరించి, ఇతరుల కాళ్లు విరగ్గొట్టి, తనకాళ్లు విరగ్గొట్టుకొని, దుఃఖంతో కుమిలి లాభమేమిటి?

ఈ విపుల సృష్టికి బాధ్యులు ఎవ్వరో మనకు తెలియకపోయినా, మన సుఖదుఃఖాలకు బాధ్యులు ఎవ్వరో మనకు తెలుసు. బాధ్యులు మనమే. దుఃఖంలోంచి బైటపడాలంటే, దుఃఖానికి నిశ్చయంగా మనం చేసుకొన్న మన అహంకార స్పృహలోంచి మనం బైట పడాలి.

సత్యమైన సుఖం ఏమిటో మనకనుభూతం కాకపోయినప్పటికి, కనీసం అనుభవిస్తున్న దుఃఖం ఏమిటో అర్థం చేసుకోటానికి పూనుకుందాం. అప్పుడు ఆనందానికి, అహంకారానికి మధ్యనున్న వైరుధ్యాన్ని గ్రహించటానికి వీలవుతుంది.

## విజయవాడ ప్లానింగ్ కమిటీ

విజయవాడ, జూలై 29: విజయవాడ పురపాలకసంఘ ప్లానింగ్ సభ్యత్వానికి శ్రీ గుడివాడ వెంకటరాజుగారు రాజీనామా యిచ్చారు. (స్వ. వి.)

# వారఫలాలు

అగస్టు 1 వ తేదీ మొదలు 7 వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి 8 సాయంత్రం నుండి బుధుడూ (కర్కాటకం) కుజ రాహువులు (ధనస్సు) గురువూ 3 వరకు బుధుడూ (మిథునం) శుక్రుడు 2 వరకు (సింహం) 3 నుండి (కన్య) శని (తుల) చంద్రుడు (సింహం-కన్య-తుల-వృశ్చికాల్లో)

### రాశ్యంతర గ్రహయోగములు

రవి బుధ-శుక్ర (త్రికోణం) [?] కుజ-బుధ (షడష్టకము)

### మార్కెట్టు (ధరలు) మార్పులు

అగస్టు 2 వ తేదీఉదయం శని మకరనవాంశ ప్రవేశం, స్వాతీ సంచారం, సకాల వర్షములనూ అధికఉత్పత్తినీ సూచించును. కాని రాజకీయ కారణరీత్యా ప్రత్తి-నూనెలూ-ఇనుముకు సంబంధించిన వాటాలూ తాత్కాలికముగ పెరుగును.

### జౌళ్లు [?] (ప్రత్తి) నూలూ-వస్త్రములు

క్రొత్త వాయిదా ఏర్పడినంతవరకు ప్రత్తి వ్యాపారం మంచిదికాదు. 2 నుండి కొంత తాత్కాలిక తేజీవస్తుంది. వారాంతంలో విడుదల మంచిది.

### వెండి బంగారములు

జూలై 30 మంగళ బుధవక్రదర్శనం [?] అశుభసూచన, మార్కెట్టులో హెచ్చు తగ్గులు పెరుగుతవి. 3 వ తేదీ హెచ్చును. గమనించి అమ్ముట మంచిది.

### ధాన్యములూ—ఇతర ఆహార వస్తువులు

బియ్యమూ-గోధుమలూ పలుప్రదేశములకు ఎగుమతి కారణంగా తాత్కాలికంగా హెచ్చుతవి. పప్పులు మరికొంత తగ్గుతవి. ఇతర మిర్చి, చింతపండు మొదలగువానిలో నిలకడ కల్గుతుంది.

### శుభ ముహూర్తములు

3 వ తేదీ సప్తమీ తిథి ఉదయం 9 గంటల 36 నిమిషములకు చిత్రా నక్షత్రయుక్త కన్యాలగ్నమున వివాహ, అన్నప్రాశన, గృహారంభాదులకు శుభం-హితం [?].

### మీ లగ్న (రాశి) ఫలం

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1-వ పాదం)

ఈ వారంలో 4 నుండి బుధుడూ 2 వరకు శుక్రుడూ అనుకూలురు. పరిస్థితులూ ఆరోగ్యం నిలకడగా యుంటవి. దేనికీ త్వరపడి పట్టుదలతో ముందుకు రావడం మంచిదికాదు. గత అరువారాలలో మీకు అండగా నిలుచున్నవారు సమయానికి అగపడరు. వ్యాపార వృత్తుల్లో స్వల్ప లాభాలుగా అగపడినవి కూడా సమయానికి ఉపయోగించవు. అల్పుల పరిచయంవల్ల అన్ని వ్యవహారాలలోనూ విషమ పరిస్థితుల కలుగుతవి. ఉద్యోగంలో యున్నవారికి పై ఫలితములు ఎక్కువగా అన్వయించవు వారాంతంలో శుభ వార్తలు వింటారు.

**వృషభం** (కృత్తిక, 2,3,4 పాదాలు రోహిణి, మృగశిర 1, 2 పాదాలు)

ఈ వారంలో రవి, గురు, శుక్ర, శనులు అనుకూలురు. మీ రాజ్యాధిపతి శుక్రుడు నీచంలోయున్నా రజిత మార్గియై బుధునకు త్రికోణకుడై [?] యోగ పీఠమును పొందుటచే శుక్రుడు అన్ని వ్యవహారాలలోనూ అనుకూలత యుంటుంది. పెట్టుబడులు లాభకరంగా యుంటవి. వ్యవహారాలలో యున్న ఆస్తి స్వాధీనం అవుతుంది. కాని వ్యాపారస్తులకు సామాన్య ఫలితమే యుంటుంది. శుభ ప్రస్తావనలూ నిర్ణయాలూ ఏర్పడుతవి. 1, 2 ప్రయాణానికీ, పెట్టుబడులకూ, నూతన యత్నానికీ అనుకూలం.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1 2 3 పాదాలు)

ఈ వారంలో శుక్రుడు మాత్రం అనుకూలుడు. అన్ని వ్యవహారములలోనూ అత్యంత జాగ్రత్త అవసరం. కోర్టు, కచేరీ వ్యవహారములలో కొంత అవాంతరం కలుగుతుంది. వ్యాపార వృత్తులు సరిగా నడువవు. ఆరోగ్యం కూడా కొంత తగ్గుతుంది. ఆప్త మిత్రులు కూడా సహాయానికిరారు. సాహసాన్ని కోరే ఏ వ్యవహారంలోనూ ప్రవేశించవద్దు. కుటుంబంలో మాటల మధ్య స్త్రీలతో కలతలు ఏర్పడుతవి. వారాంతంలో ప్రయాణానికీ ఇతరులను కలవడానికీ, శుభ సంప్రదింపులకూ అనుకూలం.

**కర్కాటకం** (పునర్వసు 4 వ పాదం పుష్యమి, ఆశ్లేష)

ఈ వారంలో కుజ, శుక్రులు అనుకూలురు. మీ మిత్రుడు మంగళుడు గత వారంకన్న అనుకూలుడూ. మనస్సుకు విశ్రాంతి కలుగుతుంది. మీరు చిక్కులలోయుండి కదలలేక యున్నా మిమ్మల్నికగల వారెవ్వరూ యుండరు [?]. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. భూములూ, గృహములకు సంబంధించిన ప్రయత్నాలు కొంత వెనుకబడుతవి. వ్యాపారాదులలో పెట్టుబడులు చేయ సంకల్పాలు కలుగుతవి. కొంచెం ఆగండి. వారాంతంలో మిత్రులలో మనస్తాపం, బద్ధకం, ఆశాభంగం.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం)

ఈ వారంలో గురు, శుక్ర, శనులూ 2 వరకు బుధుడూ అనుకూలురు. పరిస్థితులు యథాతథంగా యుంటవి. ఆర్థికంగా కొన్ని లోపములు కలుగుతవి. కొని సవరించుకొనగలుగుతారు. రాజ్యాధిపతి నీచసంచారం భోజన శయన సౌఖ్యాలకు భంగం కలిగించ కలదు. ఉద్యోగాదులలో విశ్రాంతి యుండదు. దుష్టులతో సంభాషించవలసి వస్తుంది. ప్రయాణంవల్ల శ్రమ కలుగుతుంది. వారాంతంలో వ్యాపార అభివృద్ధి ప్రయత్నాలు వ్యర్థం అవుతవి.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పాదాలు హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో రవి, బుధ, శుక్రులు అనుకూలురు. మీ మిత్రులు బుధ, శుక్రులు స్వక్షేత్రవర్తులు ఖర్చులు తగ్గుతవి. లోపాలు సవరించుకొను అవకాశాలు కలుగుతవి. సజ్జనసహవాసం లభించగలదు. కాని సడలిన ఉత్సాహం చేకూర్చుకొనడం అవసరం. కుటుంబంలోనివారి సౌఖ్యానికై ఖర్చులు పెరుగుతవి. కొన్ని వ్యాపార వ్యవహారాలవల్ల క్షీతి కలుగుతుంది. ధైర్యం అవసరం. వారాంతంలో ప్రయాణం పెట్టుబడులూ లాభించకలవు.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో రవి, కుజ, గురు, శుక్రులూ 4 నుండి బుధుడూ అనుకూలురు. 2 వరకు మీ రాజ్యాధిపతి శుక్రుడు లోహమూర్తి తరువాత వ్యయచారి. అందువల్ల ఇరుగుపొరుగులలో కలహములూ, స్వల్పఅనారోగ్యం మనస్సునకు స్థిరమూ, శాంతియుండక పోవడం ఏర్పడుతుంది. ఆర్థిక పరిస్థితులు గతవారాలలోకన్న ప్రోత్సాహకరంగా యుంటవి. శుభపుణ్యకార్యాల పేరుతో ఖర్చులు పెరుగుతవి. విశ్రాంతి అవసరం. ఒకానొక వ్యవహారములో కార్యదీక్ష పట్టుదలా పెరుగుతుంది. వారాంతంలో ప్రయాణం. మిత్రసమాగమం శుభకార్యాలోచనలు.

**వృశ్చికం** (విశాఖ 4 వ పాదం అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారంలో 3 నుండి శుక్రుడూ 4 వరకు బుధుడూ అనుకూలురు. వ్యాపార వృత్తి పరిస్థితులు అస్థిరంగా యుంటవి. ఎన్నో ప్రయత్నాలూ, ఆలోచనలూ జరుపుతారు. కాని చివరి నిమిషాల్లో నిరాశకలగడం ప్రయత్నం మానడం జరుగుతుంది. ఆరోగ్యం నిలకడగా యుండదు. మీకు అపమిత్రబలం ఎక్కువ. సమయంలో ఎంతైనా సహాయం వస్తుంది. ఆస్తిమార్పులూ, పెట్టుబడులూ ప్రస్తుతం మానడం మంచిది. వారాంతంలో ప్రయాస, ద్రవ్యనష్టం.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ ఉత్తరాషాఢ, 1 వ పాదం)

ఈ వారంలో గురు-శనులూ 2వరకు బుధుడూ 2 వరకు శుక్రుడూ అనుకూలురు. లాభాధిపతి రాజ్య సంచారం గమనించదగ్గది. సాధారణంగా ఈ స్థితి ఉద్యోగస్థులకు విసుగును కలిగించ కలదు. కుటుంబంలో భార్యా బిడ్డలతో పేచీలూ - మనస్పర్థలూ ఏర్పడుతవి. మనస్సునకు విశ్రాంతి యుండదు. వ్యాపారాదుల్లో స్వల్పఫలం - ఎంత జాగ్రత్తగా యున్నా దూషణ పడడం -చేయడం జరుగుతుంది. వారాంతంలో కారణం లేని కలహం - కొంగాని ఖర్చులు.

**మకరం** (ఉత్తరాషాఢ, 2, 3, 4 పాదాలు శ్రవణం ధనిష్ఠ 1,2 పాదాలు)

ఈ వారంలో శుక్రుడు 3 వరకు బుధుడూ అనుకూలురు. గ్రహబలం ఎక్కువగా అగపడకపోయినా బుధ, శుక్రులు రజితమూర్తిత్వం వ్యాపారాదుల్లో నిర్లక్ష్యం వల్ల పూర్తి ఫలితం ఇవ్వరు. వ్యయకుజుడు అకస్మాత్తు దేహబాధలను కలిగించ కలడు. సౌఖ్యం తగ్గుతుంది. బుద్ధి చాతుర్యాన్ని ప్రకటించ వలసిన సమయం వస్తుంది. ప్రయాణావశ్యకత ఏర్పడుతుంది. వారాంతంలో వ్యాపారంలో లాభం మిత్రులవల్ల సౌఖ్యం.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో రవి-కుజ-గురులూ 3-4 ల నుండి శుక్రబుధులూ అనుకూలురు. ముఖ్య గ్రహబలం పారమధ్యంన్నుండి [?] శుభాన్ని చూపుతుంది. చిక్కులు వదిల్చుకొను ఉపాయములు అగపడుతవి. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. వ్యాపార వృత్తుల్లో ముందుమార్గం సుగమంగా యుంటుంది. లాభంలో యున్న కుజునకు ముందు రాహువుండుట చేత వ్యాపారవృత్తుల్లో లాభకార్యములకు ఆటంకములు ఎక్కువ. ఇతర గ్రహబలం కొంత తోడుపడుతుంది 1 2 ప్రయాణానికీ-మిత్రులను కలవడానికీ నూతన యత్నానికీ అనుకూలం.

**మీనం** (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో కుజుడూ 3 వరకు బుధుడూ అనుకూలురు. అన్ని రంగాలలోనూ అత్యంత జాగ్రత్తను చూపవలసిన సమయం. మీరు ఎంత బుద్ధి చాకచక్యం కలవారైనా 'విధి' బలీయం అని గ్రహించిపోవడం మంచిది ఇతరులలోపాలను సరిదిద్దే ప్రయత్నాలు ప్రస్తుతం మీకు కూడదు. క్రిందటి దౌర్బల్యం [?] మిమ్ము సమయంలో కొస్తుంది. ఆరోగ్యం కొంత తగ్గుతుంది. పెట్టుబడులూ-ప్రయాణం అపడం మంచిది.

# "భాషాప్రయుక్త రాష్ట్ర విభజన"

— శ్రీ — చుండూరి రాధాకృష్ణమూర్తి

అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణ ఫలితంగా ఆంధ్ర రాష్ట్రం సిద్ధించింది. ఆంధ్రుల చిరకాల వాంఛితము నెరవేరిన పిదప దక్షిణాదివారు కూడా తమకు భాషా రాష్ట్రాలు కావాలని తీవ్ర ఆందోళన జరిపారు. ఫలితముగా కేంద్రప్రభుత్వం భారతదేశంలో ప్రతిసారి భాషారాష్ట్రాలు కావాలనే వివాదాలు ఇక ముందు లేకుండా ప్రతి సరిహద్దులోను న్యాయంగా చిత్తశుద్ధితో నిష్పాక్షికముగా సర్వవిధాలా తగాదాలను పరిష్కరించి సుస్థిర శాంతిని నెలకొల్పే ఉద్దేశ్యముతో "ఫజల్ అలీ కమీషన్" ను నియమించింది. ఆ కమీషన్‌వారు తమ నివేదికకు కావల్సిన విషయ సేకరణకు దేశమంతా పర్యటిస్తున్నారు. ఆ కమీషన్‌కు ప్రతి సంఘాలు, సంస్థలు పార్టీలు తమతమ నివేదికలను సమర్పించుచున్నవి.

వీరు పంపించే నివేదికలలో ఎంత సత్యముందో విచారిద్దాము. ప్రతివారు తమ నివేదికను చాలా తెలివితో సమగ్రంగా తయారుచేసినాము అని చాటుతున్నారు. ...

... ఏర్పడుతాయి.

1. విశాలాంధ్ర
2. ఒరిస్సా
3. అస్సాం
4. పంజాబ్
5. బెంగాల్
6. తమిళనాడు
7. సంయుక్త కర్ణాటకము
8. బృహన్ మహారాష్ట్రరాజ్యం
9. మహా గుజరాత్
10. ఐక్య కేరళ
11. హిందీరాజ్యం
12. జమ్మూ కాశ్మీరు

నేడున్న చిన్న పెద్ద రాష్ట్రాలన్నిటిని రద్దుచేసి కేవలం భాషను ఆధారంగా తీసుకొని పై 12 రాష్ట్రాలు నిర్మించాలి. అవిభజనానుసారం ఈ రాష్ట్రాలు వివిధంగా విభజించాలి. ఇంకా విభజించ బడిన వాటికి ఏ ఏ జిల్లాలు చేర్చాలో చర్చిద్దాం.

1. విశాలాంధ్ర: హైదరాబాదు ...

బాదులోని కన్నడ మరాఠీ జిల్లాలను వేరుచేసిన పిదపమిగిలివున్న తెలంగాణా జిల్లాలను అదేవిధంగా ఉంచి ప్రత్యేక తెలంగాణా రాజ్యాన్ని నిర్మించాలని వీరి వాదన. ఆ తెలంగాణా రాజ్యం సర్వహంగులు కలిగి స్వయం పోషకంగా ఉండగలుగుతుందని ఈ క్రింది సూచనలు చేశారు.

1 కోటి జనాభా గల్గి 18 కోట్ల ఆదాయంతో విశాలమైన రాజ్యం ...

బీహారు, వింధ్యప్రదేశ్, బిలాసపూర్, అజమీరు, భోపాల్, హిమాచల ప్రదేశ్, ఢిల్లీ ఈ చిన్న పెద్ద రాజ్యాలన్నిటిని కలిపి పరిపాలనా సౌలభ్యం కొరకు 4,8క, రాజ్యాలుగా చేయాలి. పై విధంగా చేసినప్పటికి వారిలో ఏ విధమైన విభేదాలు రావు. భారతదేశంలో హిందీ రాజ్యానికి తప్ప అనేక రాజ్యాలు ఏర్పరచే యోగ్యత మరే భాషా ప్రాంతానికి లేదు.

పై చెప్పినట్లు భాషల ఆధారంగా రాజ్యాలను నిర్మించిన ఖ, గ, రాజ్యాలురద్దు చేయట మవుతుంది. గ, రాజ్యాలలో లెఫ్టినెంటు గవర్నరు పరిపాలిస్తారు. ఆర్థికంగా రాజకీయంగా రవాణా సౌకర్యాల దృష్ట్యా యోచించినట్లయితే ఈరాజ్యాలు వెనుకబడి ఉన్నవని తెలుస్తుంది. ఆరాజ్యాలలో బాటు అక్కడ లెఫ్టినెంటు గవర్నర్లు గూడా రద్దుచేయబడతారు. అప్పుడు వీటిని రద్దుచేసి క, రాజ్యములలో కలపాలి. ...

...

ప్రభుత్వం గమనించాలి. అట్లు చేయని యెడల మన ప్రభుత్వపు అసమర్థత స్పష్టమవుతుంది సర్వాధికారాలుగల మన ప్రభుత్వం ప్రజాక్షేమం కోసం ఈపని చేయక పోతే మన రాజ్యాంగంలో పేర్కొన్న "సంపూర్ణ ప్రభుత్వ సంపన్న లోకతంత్రాత్మక గణరాజ్యం" అన్న సూక్తి నిరర్థకమే కాగలదు.

## మైసూరు - సరిహద్దు బస్సు రూట్లు

### పన్నుల చెల్లింపు: ప్రభుత్వ ఆదేశం

కర్నూలు, జూలై 30: రాష్ట్రావిభజనకు పూర్వం 1953 సెప్టెంబరు 13 వరకూ, (ప్రస్తుతం మైసూరులో కి పోయిన ఆంధ్ర ప్రాంతాలలో ని రూట్లలో తిరుగుతున్న మోటారు బండ్ల విషయంలో, 1953 అక్టోబరు 1వ తేదీ, 1954 జనవరి 1వ తేదీ, 1954 ఏప్రిల్ 1వ తేదీ, 1954 జూలై 1వ తేదీలతో ప్రారంభమయే క్వార్టర్లకు మోటారు బండ్ల చట్ట క్రింద అప్పటి రేట్లను, 1953 సెప్టెంబరు 30తో అంతమయే క్వార్టర్ కు పన్నులు చెల్లించిన ప్రదేశాలలో నే చెల్లించాలని ప్రభుత్వం ఆదేశించింది. 1953 అక్టోబరు 1వ తేదీ నుంచి మైసూరులోకి పోయిన ప్రాంతాలలోనూ, ఆంధ్రరాష్ట్రంలోనూ ఈ రూట్లు ఉండటంవల్ల అంతి రాష్ట్రీయ రూట్లుగా మారాయి.

## ఉద్యోగవార్తలు

కర్నూలు, జూలై 31: పరిశ్రమలు వాణిజ్యశాఖా అసిస్టెంటు డైరెక్టర్ ఏ. ఎస్. పట్నాయక్ గారికి జూలై 5వ తేదీ నుంచి 75 రోజుల సెలవు మంజూరైంది.

అనంతపురం సబ్ డివిజన్ హైవేస్ అసిస్టెంటు ఇంజనీర్ టి. ఏ. రామానాయుడుగారిని డివిజనల్ ఇంజనీర్ గా తాత్కాలికంగా నియమించారు. ... గారిని ... తెన ... (కాకినాడ) హైవేస్ డివిజనల్ ఇంజనీర్ గా బదిలీ చేశారు.

# పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ విధానం

"సాబాజీ"

ఇది యంత్రయుగ-అణుశక్తి యుగముల యుగసంధి. ప్రపంచం నలుమూలలా పారిశ్రామిక, శాస్త్రీయ రంగాలలో క్రొత్తక్రొత్త నూతన వ్యవస్థను నిర్మించుచుంటూ పరవళ్లుతీస్తూంది. అట్టి ప్రపంచంలో ఒక సర్వ్యదేశమైన భారతదేశం యీ పారిశ్రామిక రంగంలో విస్తాయినందుకున్నదో సవివరంగా తెలుసుకొనవలసిన బాధ్యత మన మీద వుంది. స్వాతంత్ర సంసిద్ధి తరువాత జాతీయ ప్రభుత్వం పారిశ్రామికంగా ఎంత మేరకు పురోభివృద్ధి గాంచగలిగింది?

కాంగ్రెసు ప్రభుత్వం ...

ద్యోతక మౌతుంది. ఈ వక్క పత్యాన్ని ప్రజా బాహుళ్యం గ్రహించ గలిగింది గాబట్టే యీనాడు మా ర్కెట్టులో ప్రభుత్వ పరిశ్రమల నాటాలకు డిమాండు లేదు. వసే, ప్రైవేటు పరిశ్రమలలో పెట్టుబడి పెట్టిందువలన సొమ్ము రాలేదని ప్రశ్నించవచ్చు. దానికి అనేక కారణములున్నవి. (ఎ) ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వ మవలంబిస్తూన్న పన్నుల విధానం సక్రమంగా లేదు. (బి) ఏనాడు ఏ ఫ్యాక్టరీని జాతిపరం చేస్తారో, ఏ కంట్రోలు విధిస్తారో చెప్పలేము. (సి) ఏ సమయాన ఎట్టి ట్రిబ్యునల్ వస్తుందో, ఎట్టి కార్మిక శాసనం ఊడిపడుతుందో ఊహించలేము. ఇట్టి నిరంతర చంచల విధానమే ప్రజలను పరిశ్రమలనుంచి దూరం ...

...

క్రీడారంగం:

# ఫుట్‌బాల్ పోటీ: మైసూర్‌పై బీహార్ విజయం

మద్రాస్, జూలై 31: నేషనల్ ఫుట్‌బాల్ పోటీలలో నిన్న సాయంత్రం బీహారు మైసూరుపై అమోఘ విజయం సాధించింది. బీహారు 2 గోలులు చేయగా మైసూరు అతి కష్టం మీద ఒక్క గోలు చేయగలిగింది.

బీహారు విజయం ఎవరూ అనుకోని విశేష సంఘటన. పరిపూర్తిగా ఫ్వల్పానుభవంతో వచ్చిన ఆంధ్ర తో నే 8 గోలులు ఆడి, అదనపు కాలంలో కేవలం ఆంధ్రజట్టు పాంపాటుతో ఒక్క గోలుతో గెలిచిన బీహారు పర్వలో ముఖ ప్రజ్ఞావంతమని ప్రసిద్ధిపొందిన మైసూరు జట్టును ఓడించ గలుగుతుందని ఎవరు అనుకొంటారు కి ఎవరూ అనుకోలేదు. విజయం అయితే అందరూ అనుకోవటానికీ, ఆటలో ఫ్వాల్గొనేవారు అనుకోవటానికీ అంతరంవుంది. ఆఅంతరమే మైసూరుకు ఈ అవాంతర దురవస్థను తెచ్చిపెట్టింది.

మైసూరుజట్టు బీహారు జట్టును గురించి అందరూ అనుకొన్నట్లే అనుకొని, అవలీలగా జయించగలమనే అతివిశ్వాసంతో ఆట మొదలుపెట్టింది. చాలాసేపు అట్లాగే ఆడింది. ఆఖరుకు ఇక కూడదీసుకోవటానికి వీలులేని పరిస్థితిలో విజృంభించి, వేళా కోళం పాలయింది.

బీహారుజట్టు అట్లా కాదు. తనకి క్రితీ, ఎదిరికి క్రితీ చక్కగా చేరిజావేసుకొని రంగంలో దిగింది. శక్తి వంచన లేకుండా శ్రమపడి బహుచక్కగా నేర్పుగా ఆడి విజయం గడించింది.

నిన్న బీహారు ఆట మూస్తాం చే అప్పుడప్పుడు "వీరు ఇంత ప్రాభిమను ఆంధ్రతో మొదట ఆడినప్పుడే చూపితే అనవసరమైన గొడవకు అస్కారం లేకుండా పోయేది కదా.. అనిపించింది. మరి ఆంధ్రజట్టు ముందు వీరు యీ ప్రాభిమను చూపనేలేక పోయారేమో తెలియదు.

దేవరాజ్ రిఫరీగా, ఎ. డి. పార్థసారథి, ఉచ్చిత లైన్స్‌మెన్‌గా 5.15కి ఆట ప్రారంభమయింది. బీహారుజట్టులో ఆంధ్రతో ఆఖరురోజున ఆడిన వారే వున్నారు. మైసూరు జట్టులో కన్నయ్య గాని కి బదులు మారిసెంటర్‌హాఫ్‌గానూ, ఆంధ్రో నీ కి బదులు రామకృష్ణ లెఫ్ట్‌ఔట్‌గానూ ఆడారు. మిగతావారు మామూలే (గోలీ - కుప్పుస్వామి, ఫుల్‌బాకులు - ముత్తు, మునిరెడ్డి; హాఫ్‌బాకులు - యేసు, కెంపయ్య; ఫార్వర్డులు - రామకృష్ణ, పుష్పరాజ్, బాసిల్, రామయ్య, బాబు).

మైసూరు దక్షిణాభిముఖంగా ఆట ఉపక్రమించింది. అందరూ అనుకొన్నట్లే మైసూరు ఫార్వర్డులు చక్కగా బంతిని బీహారుగోలుమీదికి తన్నుకుపోయారు. కాని బీహారు రక్షణ శ్రేణిదుర్భేద్యమని బుజువు ప్రారంభమయింది. బాలు మధ్యకుపంపిన ఒక బంతిని పుష్పరాజ్ లాగితన్నగా గోలీ దాస్ చక్కగాపట్టుకొని అవతలికిపంపి వేశాడు. ఆ వెంటనే మళ్ళీ బంతి బాసిల్ కాళ్ళ మీదికి, పరిగ్గాపంపితే గోలులోపడేటట్లు, వచ్చిందికాని అతడు దానిని బయటికి కొట్టాడు. తర్వాత బీహారు ఫార్వర్డులు విజృంభించారు. చక్కని పరస్పరాపగాహనతో, కలిసి కట్టుతనం చూపుతూ మైసూరు గోలుమీద ముట్టడులు మొదలుపెట్టారు. అయితే కొనకటి వరకే ఫినిష్ తక్కువైనందున తలిచిన ప్రకారం గోలులు చేయలేకపోయారు. వీరి ఈ ఉధృతం మైసూరు ఆటగాళ్లను కలవిలపేసి ఖంగారుపెట్టింది. గోలీ కుప్పుస్వామి ఒకసారి తనహాల్తైనరూ లేకపోవటం తెలిసికూడ బీహారు ఫార్వర్డ్ తరుముకువస్తున్న బంతిని పట్టుకోవటానికని గోలు దారిని గోలును వదిలిపెట్టి ఎడమమూల కెండా వరకూ పరుగెత్తడంతో గ్రహించండి. రెండవ పగంలో ఈయనే ఒకసారి మధ్యహద్దు గీతవరకూ పరుగెత్తుకు వచ్చాడు. 25-వ నిమిషంలో యేసుదాస్ బీహార్ రైట్ యిన్ రుద్రను పెనాల్టీ ప్రాంతానికి అవతల ఫౌల్ చేశాడు. ఆ ద్వారా వచ్చిన కిక్కుతో మణి గోలు సంపాదించాడు. ఈ గోలు బహువిచిత్రంగా జరిగింది. మణి బాగా వరకొయించి, బంతిని బలంగా నేలబారుగా తన్నాడు. కుప్పుస్వామి అది తన వడిచేతి సైపుకి వస్తుందని అటు అడ్డం వచ్చాడు. కాని అది ముక్కుకొలిని రాచుకొని దారి తప్పి కుప్పుస్వామి ఎడమ చేతి వైపునుంచే గోలులో జొరబడింది. బీహారు తమ ఉన్నతాన్ని అట్లాగే నిలబెట్టుకొంది. ఈ గోలు కావటం మైసూరులో పట్టుదలకు బదులు ఖంగారును హెచ్చించింది. మరిరెండు నిముషాలకే బీహారుకు ఒక కాచ్ లభించగా, ఇమామ్ తన్నిన బంతిని ఫటర్జీ చక్కగా తలలో గోలులోకిపంపించాడు. విశ్రాంతిసమయానికి బీహారు 2-0 గోలుతో ముందు నిలిచివుంది.

తిరిగి ఆట ప్రారంభమయాక మైసూరులో కొంతపట్టుదల ద్యోతకమయింది. 6వ నిమిషంలో రామకృష్ణ మధ్యకు పంపిన బంతిని బాసిల్, రామయ్య, అటూ ఇటూ తన్నుతుండగా బాబు నెర్పుగా అందుకొని దొరక బుచ్చుకొని గోలులోకి విన్న వేశాడు. అదొకటి మైసూరు సాధించిన గోలు, ఆ తర్వాత మైసూరు పౌరుషంతో ఆడటం ప్రారంభించగా, బీహారు రోదికి కిచపండును హోగొట్టుకోవటమెందుకని రక్షణకు గట్టిగా పూనుకొన్నది. అయితే మధ్య మధ్య వారి పార్వర్డులు బంతులను ఎగలన్నుకుపోయి మైసూరు వారిని ముఖ్యంగా గోలీని హడలగొట్టక పోలేదు. ఆటముగిసే సమయం దగ్గర పడుతున్నకొద్దీ మైసూరులో కసి సంరంభం అయినా చేసుకోండామనే ఆత్రం కనపడింది. బంతి బీహారుగోలు వద్ద అటూ ఇటూ బహు ప్రమాదకరంగా దొర్లజొచ్చింది. బీహారు ఫుల్‌బాకులు, గోలీ అప్రమత్తులై బంతి గోలులోకి పోకుండా అటకాయించారు. ఒకసారి మైసూరుకు మంచి అవకాశం రాగా రామయ్య అటూ ఇటూ చూడకుండా లాగితన్నగా అది గురికి తప్పిపోయి ఎడంగాపోయి అవుటయింది. ఆట ఆఖరిక్షణాలలో బీహారు గోలు దగ్గర మైసూరుజట్టు ఫౌలు చేయటం, ఆఫ్‌సైడ్ కావటం మొదలైన గడబిడలో ఒకసారి వారు తన్నినబంతి గోలులోకి పోయినాకూడా రిఫరీ అన్యథా నిర్ణయించటం జరిగింది. అంతలోనే వేళ అయిపోయింది. బీహారు మైసూరుపై గెలిచి సెమిఫైనల్‌కు వెళ్ళింది.

నిన్న ఈ పోటీకిముందు సర్వీసెస్ జట్టుకూ సదరన్ రైల్వేజట్టుకూ ఎగ్జిబిషన్ పోటీజరిగింది. మొదటిది రెండో దానిని 2-0 గోలులతో ఓడించింది.

## హైదరాబాదు జట్టు

హైదరాబాదు జట్టు నిన్న సాయంత్రం గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో వచ్చారు. వీరికి మేనేజరు జమీర్ అహమ్మద్. రేపు మధ్య భారత్‌తో ఎవరెవరు ఆడతారో ఇంకా నిర్ణయం కాలేదు కాని ఆయా పొజిషన్లలో ఆడటానికి యీ దిగువ వారు వచ్చారు. గోల్ కీపర్లు: అహమ్మదుల్లా ఖాన్, అబ్దుల్ మజీద్. ఫుల్‌బాకులు: అజీజ్, లతీఫ్, సలామ్. హాఫ్‌బాకులు: జమాల్ నూర్, పాట్రిక్, అహమ్మదు హుస్సేన్. ఫార్వర్డులు: మొయీన్ (కాప్టెన్) లయూక్, దొరస్వామి, ఇనామ్, మహమూద్, బద్రుద్దీన్, సయ్యద్ అహమ్మద్.

## ఆంధ్ర ఫుట్‌బాల్ అసోసియేషన్ సన్నాహాలు

ఆంధ్ర ఫుట్‌బాల్ అసోసియేషన్ వారు ఢిల్లీలో జరగనున్న డురాండ్ ఫుట్‌బాల్ టూర్నమెంటులోనూ, బొంబయిలో జరగనున్న రోవర్స్ ఫుట్‌బాల్ టూర్నమెంటులోనూ పాల్గొనటానికి బలవత్తరమైన ఆంధ్ర జట్టును ఏర్పరచి పంపాలని ఆలోచిస్తున్నది. ఇందుకుగాను కలకత్తాలో పెద్ద పెద్ద జట్లలో కాంట్రాక్టులపై ఆడుతున్న ఆంధ్ర ఆటగాళ్ళు అప్పారావు ప్రభృతులను కూడా ఆహ్వానించాలని తలుస్తున్నది.

## వచ్చేయేడు నేషనల్ పోటీల నిర్వహణ

నేషనల్ ఫుట్‌బాల్ పోటీలను వచ్చేయేడు ఢిల్లీలో జరపవలసిందిగా ఢిల్లీ ఫుట్‌బాల్ అసోసియేషన్ అఖిల భారత ఫుట్‌బాల్ ఫెడరేషన్‌ను కోరినట్లు తెలుస్తున్నది.

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 31:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎడ్వర్డుబొమ్మ

| | |
|---|---|
| సేల్సుటాక్సుతో సహా | రు. 88 0-0 |
| పెట్లాబంగారం తులం | రు. 88 0-0 |
| మూస బంగారు | రు. 86-8-0 |
| సీమవెండి తులం100కి రేడి | రు. 157-0-0 |
| చిల్లర ధర | రు. 1-10-3 |

వేరుశనగ

(531 పౌ॥ 1-కి ఎక్సుశోస్తా గిడ్డంగులు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 183-184-0-0

| | |
|---|---|
| వేరుశనగనూనె ఎక్సు పెల్లర్ బీలో 8% (500పా.) రేడి చిల్లరధర | రు. 249-0-0 |

కొంకాయనూనె (37½ పౌనులు)

| | |
|---|---|
| అంబుమార్కు | రు. 29-8-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 29-8-9 |
| రాజా బ్రాండ్ | రు. 28-8-9 |

అముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పౌ) | రు. 200-0-0 |

పంచదార

| | | |
|---|---|---|
| ప్యారీ | (2 అందరు) | 84-0-9 |
| జపాన్ | (66 పౌ) | 25-0-9 |
| జర్మనీ | (223 పౌ) | 81-0-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, జూలై 31: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 155-12-0 |
| బంగారం (1 తు.) | 86-13-0 |
| సావరిన్ | 57-4-0 |
| కలకత్తా మార్కెట్ ధరలు: | 154-6-0 |

87-2-0; 87-0-0.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St, Madras.

నూనెల, నూనెవిత్తుల ఫార్వర్డు మార్కెట్ల పరిశీలనకై నియమించబడిన ఫార్వర్డు మార్కెట్ల కమిషన్ మద్రాసు ప్రభుత్వ అధికారులతో సమాలోచనలు జరుపుతున్నారు.

ఐక్యరాజ్యసమితి సాంస్కృతికసంస్థ అధ్వర్యంలో టోక్యోలో జరుగనున్న అంతర్జాతీయ కళా, శేరిపముల గోష్ఠి ఛైర్మన్‌గా నియమించబడిన శ్రీ డి. పి. రాయ్ చౌదరిగారు పుట్టినమూనాను తదేకదీక్షతో పరిశీలిస్తున్నారు.

# 'సినిమా

## నగరంలో సినిమాలు

| | | |
|---|---|---|
| పారగన్, బ్రాడ్వే, లక్ష్మి, ఉమా | తులివిషం (తమిళం) | |
| కాసినో, ప్రభాత్, సరస్వతి | మలైకల్లన్ | ,, |
| శ్రీకృష్ణా, వెలింగ్టన్, రాజకుమారి | పెణ్ | ,, |
| సన్ | సొర్గవాసల్ | ,, |
| ఈరాస్, క్రౌన్ | పాస్వయల్ | ,, |
| మహారాణి | దేవకి | ,, |
| సినిమాసెంట్రల్ | నల్లకాలం | ,, |
| సెలెక్టు | సామ్రాట్ | (హిందీ) |
| ప్లాజా | ఆస్ | ,, |
| గెయిటీ | కాలీఘటా | ,, |
| స్టార్ | టాక్సీ డ్రైవర్ | ,, |
| అశోక్ | నబాబ్ | ,, |
| భారత్ | రాజ్ మహల్ | ,, |
| మినర్వా | Anna | |
| న్యూగ్లోబ్ | Flight of the white heron | |
| న్యూ ఎల్ఫిన్‌స్టన్ | West of zanzibar | |
| రాక్సీ | He ran all the way | |
| ఓడియన్ | Golden Blade | |
| పయొని | Because of Eve | |

## 'గాంధీపథ్' నిర్మాత అలెగ్జాండర్ మార్కొ

మద్రాసు, జూలై 31: "గాంధీపథ్" అనే చిత్రం ఇంగ్లీషులో అంతర్జాతీయ ప్రదర్శనకోసం, హిందీలో భారతదేశంలో ప్రదర్శనకోసం నిర్మిస్తున్న హాలీవుడ్ నిర్మాత, దర్శకుడు అలెగ్జాండర్ మార్కొ నిన్న సాయంత్రం కనెమెరా హోటల్‌లో పత్రికా విలేఖరులతో గోష్ఠిజరిపారు. మహాత్మ గాంధీపట్ల, భారతదేశపు ఆధ్యాత్మిక నాగరికతపట్ల, ప్రస్తుతం ప్రపంచరాజకీయాలలో భారతదేశం అనుసరిస్తున్న విశిష్టమైన, ధార్మికమైన రాజనీతిపట్ల తనకుగల గౌరవమే ఈ చిత్రం తీయడానికి ప్రోత్సహించిందని ఆయన అన్నారు. "హింసవలన ఏ సమస్యా పరిష్కారం కాదు. పరస్పర ద్వేషంవల్లనే హింస జనిస్తుంది. సౌజన్యం, దౌర్జన్యం, ఈ రెంటిలో అంతిమవిజయం సౌజన్యానిదే" అనే ఈ నీతిసూత్రాలను ఒక కథద్వారా నిరూపించటానికి తనచిత్రంలో ప్రయత్నించానన్నీ, తన చిత్రంలో మామూలు సినిమాతార లెవరూ లేరనీ, అందరూ కెమేరా ఎన్నడూ చూసెరగని సామాన్య జనులేనని ఆయన అన్నారు. ఈ చిత్రంలో గాంధీ పని తంవీరూడ దాక్యుమెంటరీకాదు. గాంధీజీ ప్రసక్తిలేదు. కాని గాంధీ సిద్ధాంతాలను చిత్రించినందువల్లనే దీనికి హిందీలో "గాంధీపథ్" అని హిందీలోను, "గాంధీపాత్" అని ఇంగ్లీషులోను పేరుపెట్టావని ఆయనఅన్నారు. ఇంగ్లీషులో 9000 అడుగులు, హిందీలో 11000 అడుగులు పొడుగుంటుంది. అక్టోబరులో విడుదల చేయబడుతుంది. ఈ చిత్రంలో రవీంద్రనాథటాగూరు మనుమరాలు నందిత, పార్లమెంటులో బీహారు సభ్యుడు బాబూరామనారాయణసింగు ప్రధానపాత్రలుగా నటిస్తున్నారు. ఈచిత్రం స్టూడియోలలో కాక, అంతా బహిరంగ సలాల్లోనే. సూర్యకాంతిలోనే షూట్ చేయబడింది. టెక్నిషియన్లు రాజ్ కమల్ కళామందిర్‌కు చెందినవారు.

అలెగ్జాండర్ మార్కొ తమ ప్రసంగంలో భారతప్రధాని నెహ్రూను ప్రపంచంలోని ఏకైక రాజకీయవేత్త అని ప్రశంసించి, అమెరికా, బ్రిటన్ మొదలైన అగ్రరాజ్యాలు నెహ్రూ విధానంలో నడిస్తే ప్రపంచశాంతి సుసాధ్యమవుతుందని అన్నారు.

## ఆంధ్ర ఫిలిమ్ వాణిజ్య మండలి

### ప్రథమ వార్షిక సర్వసభ్య సమావేశం

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, జూలై 29: ఆంధ్ర ఫిలిమ్ వాణిజ్యమండలి ప్రథమ వార్షిక సర్వసభ్య సమావేశం అధ్యక్షులు శ్రీ చెరుకూరు పూర్ణచంద్రరావుగారి అధ్యక్షతన జరిగింది. నూతన సంవత్సరానికి శ్రీ సుందరలాల్ నహాతా గారిని అధ్యక్షులుగ శ్రీయుతులు జి. కామరాజు, టి. అశ్వద్ధనారాయణ గారలను ఉపాధ్యక్షులుగ, శ్రీయుతులు యస్. కె. యన్. అయ్యంగార్, సి. వి. బాబురావుగారలు కార్యదర్శులుగా, శ్రీ చెరుకూరు పూర్ణచంద్రరావుగారు కోశాధికారిగ, శ్రీయుతులు పి. చంద్రశేఖరరావు, డి. కృష్ణమూర్తి, రాజా, ఎ. మోహన్, యస్. గోపాలరావు, పి. రామకృష్ణరావు, కె. సత్యనారాయణరావు, ఎ. యస్. శ్రీనివాసరావుగారలు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు.

సభ్యుల మధ్య గల తగాదాలను పరిష్కరించుకోవటానికిగాను ఐదుగురు సభ్యులతో ఒకఉపసంఘం నియమించే అధికారం అధ్యక్షులకు ఇచ్చారు.

కర్నూలులో మండలి ప్రాంతీయ కార్యాలయం ఒకటి ఏర్పాటు చెయ్యాలని నిశ్చయించబడింది.

గత సంవత్సరం జమా ఖర్చులను ఆమోదించారు.

## సెనేటు సభ్యత్వం

కర్నూలు, జూలై 20: విశాఖపట్టణం జిల్లాబోర్డు ప్రత్యేక అధికారి అంధ్రవిశ్వ ఆప్రైంటు [illegible] కే జ్యో నారు [illegible] జిల్లాబోర్డు [illegible] దాని ప్రతినిధిగా [illegible] సేనేటు సభ్యులుగా [illegible]. 1954 జూలై 2వ తేదీ నుంచి [illegible] సంవత్సరాలు ఈ హోదాలో వీరు ఉంటారు.

## స్థానిక అభివృద్ధి కార్యక్రమాలు

### సిమెంటు మొదలైన సప్లయి: ప్రభుత్వ ప్రకటన

కర్నూలు, జూలై 29: రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో అమలుజరిగే స్థానిక అభివృద్ధి కార్యక్రమాలలో ప్రభుత్వం ఆమోదించినవాటిలో భవన నిర్మాణానికి కావలసిన సిమెంటు, ఇనుము, రేకులు మొదలయిన అవసర వస్తువులను, ఆ యా కార్యక్రమాలను అమలు జరిపేవారికి సప్లయిచేసే విషయంలో అత్యధిక ప్రాముఖ్యం ఇవ్వవలసిందిగా కంట్రోలు వస్తువుల సప్లయి శాఖ డైరెక్టరును కోరుతూ ఆంధ్ర ప్రభుత్వం ఉత్తరువు లిచ్చింది.

## అమ్మకాల పన్ను నిబంధనలు సవరణకు ఆంధ్రప్రభుత్వ నిర్ణయం

కర్నూలు, జూలై 31: మద్రాసు జెనరల్ అమ్మకాల పన్నుల నిబంధనలలోని (1939) 21వ నిబంధనలు సవరించాలని ప్రభుత్వం నిశ్చయించిందని ఇవాళ సాయంత్రం ఒక ప్రకటనలో వివరించబడింది.

ఈ క్రిందివిధంగా ముసాయిదా సవరణచేయాలని నిర్ణయించారు "ఎప్పుడైనా, ఒక వ్యాపారస్థుడు (డీలర్), లైసెన్సీ (1) మానివేసినా, అమ్మినా, లేదా మరో విధంగా మొత్తం, లేదా వ్యాపారంలోని ఒకభాగం అమ్మినా (2) తన వ్యాపారస్థలంమార్చినా, లేదా వ్యాపారాల స్థలాలు మార్చినా, (3) లేదా కొత్త ప్రదేశాలలో వ్యాపారం తెరచినా (4) తన వ్యాపారం పేరు మార్చినా ఆ వ్యాపారస్థుడు (డీలర్), లేదా లైసెన్సీ లేదా అతను మరణిస్తే, అతని వారసుడు యీ విషయాన్ని పన్నులను విధించే, లైసెన్సుఇచ్చే అధికారికి 30 రోజులలోగా తెలియజెయ్యాలి."

ఆంధ్ర గెజెట్‌లో ప్రకటించబడిన తేదీ లగాయతు నాల్గువారాలు పూర్తి అయిన తర్వాత ప్రభుత్వం ఈ ముసాయిదా సవరణను ఆలోచిస్తుంది.

## ఇంజనీరును బదిలీ చేయాలి

### గుంటూరు పురపాలకసంఘం తీర్మానం

గుంటూరు, జూలై 29: మున్సిపల్ ఇంజనీరు శ్రీ వి. వెంకటాచలంగారిని వెంటనే బదిలీ చేయించాలని కోరుతూ స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరు, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, చీఫ్ ఇంజనీరులకు 28 మంది కౌన్సిలు సభ్యులు ఒక దరఖాస్తును పంపబోతున్నారు. కౌన్సిల్ తీర్మానాలు అనుసరించటంలో ఇంజనీరుగారి వైఖరిని తీవ్రంగా ఇందులో వీరు విమర్శించారు. (స్వ. వి.)

# గ్రంథసమీక్ష

## పాణినీయ సూత్రవ్యాఖ్య

[సంస్కృతము]

మాణలూరు వీరరాఘవాచార్య విరచితము. ప్రకాశకులు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, మదరాసు. వెల 13-12-0.

పాణినీయాష్టాధ్యాయికి ఇటీవలి కాలంలో భట్టోజీ దీక్షితుని సిద్ధాంతకౌముది మొదలు బాలమనోరమవరకు అనేక వ్యాఖ్యానాలు బయలుదేరాయి. అటు ప్రాచీనకాలంలో రచించిన కాశికావృత్తి మొదలయిన వ్యాఖ్యానాలుకూడా అసంఖ్యాకంగా ఉన్నాయి. ఇలాగ ఎన్నో విధాలుగావ్యాఖ్యానాలు వివరణాలు బయలుదేరినా సంస్కృత వ్యాకరణం నేటి విద్యార్థులకు కొరకరాని కొయ్యగానే నిలిచిపోయింది. సంస్కృతంలో వ్యాకరణము ఒక ప్రత్యేక శాస్త్రంగా వర్ధిలి విస్తృతి పొందటమే దీనికి కారణమై ఉండవచ్చును.

ప్రస్తుత పాణినీయసూత్రవ్యాఖ్యాత మాణలూరు వీరరాఘవాచార్యులు బాగా ఇటీవలి కాలంవాడు. ఈయన తన సూత్రవ్యాఖ్యానం భట్టోజీ దీక్షితుని సిద్ధాంతకౌముది ఆధారంగా తీసుకుని రచించాడు. ఈయన వ్యాఖ్యానపద్ధతిలో ఒక కొత్త విశేషం ఉన్నది.

పాణినీయ సూత్రాల ప్రకారం పరినిష్పితమైన రూపాలకే వ్యాఖ్యాత ఎన్నెన్నో కావ్యాలనుండి ఉదాహరణా లిచ్చాడు. ఇలాగ ప్రసిద్ధ కావ్యాలలోనుండి ఉదాహరణా లివ్వడమే ఈ వ్యాఖ్యానంలోని విశేషం. ఈ కారణంవల్లనే ఇతడు రూపోదహరణలకు అవకాశంలేని సంజ్ఞా సంధి శబ్దాధికార ప్రకరణాలు విడిచిపెట్టి స్త్రీప్రత్యయాల దగ్గరనించి తన వ్యాఖ్యానం ప్రారంభించాడు. ప్రస్తుత సంపుటం సిద్ధాంతకౌముదిలో పూర్వార్ధం వరకు మాత్రమే ముద్రించారు. ఉత్తరార్ధానికి సంబంధించినదంతా ద్వితీయ సంపుటంగా ప్రకటిస్తున్నామని సంపాదకులు తెలియజేస్తున్నారు.

నేటి కాలంలో సంస్కృత వ్యాకరణంలో ఎంత పాండిత్యం ఉన్నా విశేషంగా ప్రయోగజ్ఞానం ఉన్న వారు చాలా అరుదుగా కనిపిస్తున్నారు. ఇది ముఖ్యంగా ప్రయోగజ్ఞానం కలిగించ డానికి ఉద్దేశింపబడిన వ్యాఖ్యానం. సంస్కృతంలో ఇలాంటి ప్రయోగ ప్రాధాన్యంకలిగిన పాణినీయ వ్యాఖ్యానం ఇంతవరకు బయలుదేరలేదు. ఇందువల్ల ఈ వ్యాఖ్యానం విద్యార్థులకేగాక పండితులకుకూడా బాగా ఉపయోగించగలదు.

ఈ క్రింది సూత్ర వ్యాఖ్యానోదాహరణాలనుబట్టి ఈ గ్రంథ ప్రాశస్త్యం గమనించవచ్చును.

'తపస్సహస్రాభ్యాం వినీనీ' అనే మత్వర్థీయ ప్రకరణ సూత్రాన్ని బట్టి తపస్విన్ అనే రూపం ఏర్పడుతున్నది. దీనికి ఉదాహరణగా ఈ వ్యాఖ్యాత రఘువంశంలోనించి ఈ క్రింది శ్లోకంలోని తపస్వినః అనే పదం ఉదాహరణగా ఇచ్చాడు.

'నాంధసాం కమల శోభినాం తథా
శాఖినాం చ న పరిశ్రమ చ్ఛిదాం
ధర్మనేవ లఘునా యథా తయోః
ప్రీతి మాపు రతిథౌ తపస్వినః'

ఇలాంటి ఉదాహరణలవల్ల విద్యార్థులకు ప్రయోగ స్వరూపం తెలుసుకోవడం బాగా తేలిక అవుతుంది.

ఇది సంస్కృత విద్యార్థులకేగాక విద్వాంసులకుకూడా అత్యంతోపయుక్తమయిన పుస్తకం.

## శంకర విజయము:

(సంస్కృత కావ్యము)

వ్యాసాచల కవి విరచితము. ప్రకాశకులు. సంపాదకులు టి చంద్రశేఖరన్, ఎమ్. ఎ. ఎల్. టి. ప్రకాశకులు గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ మదరాసు. వెల. 9-2-0.

ఇది మదరాసు ప్రాచ్యతాళపత్ర గ్రంథాలయంవారి 24వ సంస్కృత ప్రచురణము.

సంస్కృతంలో శ్రీ శంకరాచార్యుని చరిత్ర రచించిన కవుల పేరులు కనిపిస్తున్నారు. యీ చరిత్రం కొంత మంది గద్యంలోను కొంతమంది శ్లోకాల్లోను రచించారు. మొత్తం సంస్కృతభాషలో రచించిన శంకర విజయాలిప్పటివరకు 15 దాకా లభిస్తున్నాయి. వీనిలో రెండు మూడు కేవలం గద్యగ్రంథాలే. మరికొన్ని గద్యపద్యాత్మకమైనవి. ఇక మిగిలిన వన్నీ కేవలము శ్లోకరూపంలో ఉన్నవే.

వీటిలో ఆనందగిరి వ్రాసిన శంకర విజయం సుప్రసిద్ధమైనది. మాధవాచార్యుని సంక్షేప శంకర విజయం కూడా ప్రసిద్ధమైనదే.

ప్రస్తుత శంకర విజయకర్త వ్యాసాచల కవి. ఇతనికి మహాదేవేంద్ర సరస్వతి అని మరి ఒక పేరు కూడా ఉన్నది. యీయన 15వ శతాబ్ది చివరి భాగంలో కాంచీపుర పీఠాధిపతిగా ఉండేవాడని తెలుస్తున్నది. వ్యాసాచలంలో చిరకాలం తపస్సు చేయ్యటంవల్ల యీయనకు వ్యాసాచలుడనే నామధేయం కూడా ఏర్పడ్డది. ఈయన రచించిన యీ శంకర విజయానికి వ్యాసాచలీయమనే ప్రసిద్ధికూడా వచ్చింది.

ఈ శంకర విజయంలో 12 సర్గలున్నాయి. వివాదాస్పదంగా ఉన్న ఆచార్యుని పరకాయ ప్రవేశ వృత్తాంతము యీ గ్రంథంలో కూడా కనిపిస్తుంది. ఇది చారిత్రిక గాథే కావచ్చునని విశ్వసింపవచ్చును.

ఈ వ్యాసాచలకవి ప్రామాణికుడని ప్రసిద్ధికెక్కాడు. మాధవాచార్యుడు మొదలైన పలువురు శంకర విజయకర్తలిర్ణి ప్రశంసిస్తూ శ్లోకాలు కూడా రచించారు. ఇందువల్ల శంకర చరిత్ర విషయంలో ఇతడు ప్రామాణికుడని సంపాదకులు విశ్వసిస్తున్నారు.

కేవలం శంకరాచార్య చరిత్ర దృష్టితోనే గాక కావ్యదృష్టితో చూచినా, ఇది సుప్రసిద్ధ కావ్యంగా పరిగణించదగినది. అయితే కావ్యలక్షణాలన్నీ సమకూర్చవలెననే దృష్టితో ఇది దాయా వర్ణనలన్నీ ఈ కావ్యంలో ప్రవేశపెట్టటం కనిపిస్తున్నది గాని అంతకంటె ఎక్కువ సందర్భోచిత్యం కనిపించటం లేదు. పదవ సర్గలో చేసిన వర్ణనలన్నీ దీనికి ఉదాహరణంగా ఇవ్వవచ్చును.

ఈయన కవిత్వంలో అక్కడక్కడ కాళిదాసాదుల కవితాచ్ఛాయలు కనిపిస్తున్నాయి. అయితే వ్యాసాచలుని కవిత చాలా ఘనిలోని నడిచిపోతుంది. యీ క్రింది శ్లోకాన్ని బట్టి యీ కవి ఉత్ప్రేక్షలు గ్రహించవచ్చును.

'పుష్పేషు సుప్తైసలయై
రదనచ్ఛదామ్
వృష్టభృత్పురధికం
గిరికాననస్థాః
పద్మాని పద్మనిలయాః
పరితోఽపి కృత్వం
హంసాళికే మధుకరా
స్తరుమండ మీయుః.'

ఇలాంటి రమణీయకరమైన శ్లోకాద్యనుక్రమణికతో శంకర విజయ ముద్రణాదికం చక్కగా ఉన్నది.

## పెత్తందారు

[నాటకం]

కొడూరు అచ్యుత్. విశాలాంధ్ర ప్రచురణాలయం. బకింపసాంపేట పోస్టు, విజయవాడ. 2.వెల రూపాయి.

ఇది ఆరు రంగాల నాటకం. ఒక గ్రామంలో రామయ్య పెత్తందారుంటాడు. అతడు బాగా ధనికుడు. పంచాయితీబోర్డు ప్రెసిడెంట్ ఎన్నో దురాగతాలు చేస్తుంటాడు. ఇతని దురాగతాలన్నీ మాధవరావే. అభ్యుదయభావాలు గల యువకుడు ధైర్యంతో ఎదుర్కొంటాడు. అయితే రామయ్య ఇతడిమీద ఖూనీకేసు మోపించడానికి ప్రయత్నిస్తాడు గాని చివరికొకట్ల విఫలమై మాధవరావే గెలుస్తాడు. సంగ్రహంగా ఇది ఈ నాటకంలోని కథ.

ఈ నాటకంలోని పాత్ర చిత్రణాన్ని గురించి అంతగా వ్రాయవలసినదేమీ లేదుగాని ఈ పాత్రలన్నీ కేవలం రచయిత భావాలకు ప్రతిబింబాలుగా మాత్రం కనిపిస్తాయి. కొన్ని కొన్ని ఘట్టాల్లో ఇతరులు సజీవమూర్తుల్లాగ కనిపిస్తాయి.

ఈ నాటకాన్ని బట్టిచూస్తే రచయితకు చక్కని నాటక ప్రదర్శనా జ్ఞానం ఉన్నట్లు కనబడుతున్నది.

అదీ గాక సంభాషణలు నడిపించడంలోకూడా మంచి చాకచక్యం కనిపిస్తున్నది. అందువల్లే ఈ నాటకం అంతా ఒక్కగుక్కలో చదివి వెయ్యవచ్చును.

కొన్ని నాటకాలు ప్రదర్శించినప్పుడే బాగా రక్తికడతాయి. కొన్ని చదువుతుంటేకూడా ఆవిర్భవైన అనుభూతి కలిగిస్తాయి. రెంటిలోను ఇది మొదటి తరహాకు చెందిన రూపకం.

## రేడియో

### సోమవారం, ఆగస్టు 2

#### విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7 తెలుగున వా. 7.15 మద్రాస్ నివళి 7-30 మద్రాసు వలె 8 అంగ్లమున వా.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు 1 (వి) వలె 1.30 ఎ వలె 1 40 హిందీన వా. 1.50 తెలుగున వా. 2 వి వలె 2.15 హైస్కూలుకు (అం).

సా॥ 4 ప్రాథమిక పాఠశాలలకు 5-30 సమ్మిడాల పురుషోత్తమాచారి 6 సంగీత కచేరి 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం 7 తెలుగున వా. 7-15 కృష్ణలీలాతరంగములు (గోపికాగానము) 7-30 కల్యాణి (వి) 7-45 శివ తాండవం పురాణాపిశక్త్ (ప్రసంగం) భావరాజు వెంకటస్వామి 8 అంగ్ల వా. కల్యాణం (నాటక) మద్రాసు 8-45 9 అంగ్లమున వా. 9-15 వీవల వెర్రితలు (ప్రసంగం) విలాస్‌చే 9-30 వీ. కె. సరోజ 10 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7వాద్యసమ్మేళనం 7-15 తెలుగున వా. 7-30 అర్. రాజేశ్వరి 8 అంగ్లమున వా.

మ॥ 12-30 పాఠాలు (వి) 1-30 (వి) 1.40 హిందీన వా. 1-50 (వి) 2 విదేశీయుల వా. 2.10 వి వలె 2-15 కొమ్మారెడ్డి (అం).

సా॥ 4 పాఠాలకు 4.30పార్వత్వ సంగీతము 5-30 ప్రభిల వక్కలాహారాయా. 'సారంగి' 6 అంగ్లమున వా॥ 6 15 ప్రాంతీయ వా॥ (త) 6.25 కె. పి. వెంకట్రోపాలయ్యర్ 7 పెరియపురాణ కీర్తన పార్వతీ సుహాకివన్ 7-15 తమిళమున వా॥ 7-30 క్వక్ షైము (ప్రశ్నోత్తర కార్యక్రమం) అంగ్లమున 7 50 భజన్ (వి) 8 ఎం. కె. రత్నవల్లి 8-30 కె. వెంకట్రామన్ 9 అంగ్లమున వా॥ 9-15 హిందీపాఠం (త) 9 20 (వి) వలె 10-30 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 (వి) 7-30 (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1 (వి) 1-30 అంగ్లమున వా. 1-40 (వి) 1-50 తెలుగున వా॥ 2 క్లారినెట్ 2-15 (ఎ) వలె

సా॥ 4 ప్రాథమిక పాఠశాలలకు 4-30 (ఎ) వలె 5-30 (ఎ) వలె 6-15 ప్రాంతీయ వా॥ 6-25 లలిత గీతము ఆర్. బాలసరస్వతీదేవి చిటపట చినుకులు (రచన రజని) 6-30 గ్రామస్థులకార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 కృష్ణలీలా తరంగములు 7-30 బంగ్లదేశమ్మోళనము 7-45 మలయాళ ప్రసంగం 8 శ్రీ అండాళ్ కళ్యాణము (సంగీత నాటిక) రచన దేవులపల్లి కృష్ణశాస్త్రి 9 (ఎ) వలె 9-15 వయొలిన్ 9-30 ఖల్లీ పరిణయం (కథాకాలక్షేపం) సి. సరస్వతీబాయ్ 10-30 ప్రసారసమాప్తి.

#### హైదరాబాద్

ఉ॥ 6.55 సుప్రభాత్ 7 తెలుగు వా. 7-15 వి. బాలసుబ్రహ్మణ్య భాగవతర్ 7-45 భుజలే 8 అంగ్ల వా. 8-30 ఖయాల్.

మ॥ (వి) 12-50 మరాఠీ వా. 1 వాద్యసంగీతం (వి) 1-10 (వి) 1-50 తెలుగు వా. 2 విద్యార్థుల కార్యక్రమం.

సా॥ 5-30 జి.కృష్ణమూర్తి-గీతావళి 5.45 సంగీతసాధన 6 బాలసుబ్రహ్మణ్య భాగవతర్ 6-30 వాద్య (వి) 6 40 స్థానిక ప్రకటనలు 6.45 గీతావళి-జి. కృష్ణమూర్తి 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ సౌభాగ్యందయితలు-మునిమాణిక్యం - (ప్రసంగం) 7-45 కన్నడ వా. 8 హిందీకవితలో వీర, కరుణరసాలు. (హిందీలో ప్రసంగం) వన్నీఫర్ విద్యాలంకార్ 8-15 ఆర్కెస్ట్రా పత్రమిలా 8.20 ఖయాల్ 8-50 ఉర్దూ 9 అంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 తబ్లా 9 45 భుజలే 10 ఖయాల్ 10-30 ప్రసారసమాప్తి.







## ఆర్యవైశ్యులకు విజ్ఞప్తి

ది ఆల్ యిండియా ఆర్యవైశ్య సమాజం (మద్రాసు) వారు గత 25 సంవత్సరములుగా (తిరుపతి) తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవ కాలమున ఆరియారాధనలకి సమారాధన జరుపుచున్నారు. గత సంవత్సరమునుంచి కొందరు మా అనుమతి పొందక, ఈ సంతర్పణ పేరుతో ఆర్యవైశ్య సోదరులవద్ద డబ్బు ప్రోగుచేసి వాడేయుచున్నారని తెలియవచ్చినది. కాన ఇందుమూలముగా తెలియజేయునదేమనగా, మా వద్ద అనుమతి పొందిన పత్రములు గలవారికే చందాలు ఇచ్చి రశీదుపొందగలందులకు ప్రార్థన. గౌరవ కార్యదర్శిగారికి నేరుగా చందాలు పంపించదల్చువారు 177, వైనాబజారురోడ్డు, మద్రాసు-1 కు పంపవచ్చును.

నాదెళ్ల సంపత్తుశెట్టి,
గౌరవ కార్యదర్శి.